## నవంబరు 5 విడుదల

హృదయాలను కరిగించే గీతాంజలి అద్భుత నటన మరో ప్రత్యేకత



పూర్ణ ఆర్ట్ పిక్చర్స్

# కూతురు-కోడలు

దర్శకత్వం
పి.లక్ష్మీదీపక్

సంగీతం
కె.వి.మహదేవన్

నిర్మాతలు
అట్లూరి పూర్ణచంద్రరావు
యం.చంద్రశేఖర్

శ్రీ ఫిలింస్

# గ్లాక్సోస్-డి® తో
# మీరు సర్వ స్వతంత్రులు!


టీ లేక కాఫీతో గ్లాక్సోస్-డి


నీళ్లతో గ్లాక్సోస్-డి


నిమ్మ పానీయంతో గ్లాక్సోస్-డి


పళ్లరసంతో గ్లాక్సోస్-డి


యథాతథంగా గ్లాక్సోస్-డి


పాలతో గ్లాక్సోస్-డి

మీ ఇష్టమే ఇష్టం. గ్లాక్సోస్-డి వాడేందుకు భయం లేదు నియమం లేదు.

ఎప్పుడు ఎలా కావాలంటే, అలాగే తీసుకోండి. దేనితోనైనా సరే.

అవును, ఇది మాత్రం నిజం. రెండు చెంచాల గ్లాక్సోస్-డితో తక్షణ శక్తి పొందగలరు. అలసట తీరేందుకు, కావాలన్నప్పుడు తీసుకోండి. — రోజూ, ఎల్లప్పుడూ.




# గ్లాక్సోస్-డి® తక్షణ శక్తి కోసం

CCP/GL/28 tel.


murphy
BABY
DELUXE






వట్టి కబుర్లతో నేను ఎగిరి పోతానని ఎవరు చెప్పారు?
ఇందిరా కాంగ్రెస్ సిమ్లా సభలు
నినాదాలు
కబుర్లు
ఉపన్యాసాలు


దారిద్ర్యం


గంగూలీ ఉదంతం తర్వాత హనుమంతయ్యగారి ముఖం!


పెట్టుబడి
చెడు వాతావరణంలో పచ్చని చెట్టు!


పాకిస్తాన్ యుద్ధ ప్రయత్నం
పాకిస్తాన్


నీ బూటకానికి బెదిరి పోతామా?
భారత సైన్యం

# తెలంగాణా ప్రాంతీయ కాంగ్రెస్ సంఘానికి ఎక్కువ అధికారాలు

స్వకీయమైన రాజకీయ బలం లేకుండా పార్టీ నాయకత్వం వహించి ప్రభుత్వానికి పార్టీకి సారధ్యం వహించడం ఎంతకష్టమైనదో, దఫాల వారీగా మంత్రివర్గ నిర్మాణానికి పూనుకుని ముఖ్యమంత్రి పి. వి. నరసింహారావుగారు ప్రస్ఫుటం చేశారు. పార్టీలోని వివిధ వర్గాలనుంచి వస్తున్న వత్తిడి ఎంత గట్టిదో దాన్ని తట్టుకోవడం ఎంతకష్టమో కూడా తెలుస్తూనే ఉంది. ఎన్ని వత్తిళ్లు వచ్చినా కూడా నరసింహారావుగారు చాలా వరకు నిర్ణయాలను స్వయంగానే చేస్తున్నారు. తమనాయకత్వం పట్ల వ్యక్తిగతంగా విశ్వాసం చూపుతున్నారని నమ్మకం కలిగిన తరువాతనే తమ సహచరుల ఎంపికను నరసింహారావుగారు చేస్తున్నారు. ఇందువల్లనే కొందరు మాజీ మంత్రులను కొత్త మంత్రివర్గంలో చేర్చుకోవడంలో జాగు జరిగింది.

కొత్త మంత్రివర్గ నిర్మాణం గూర్చి సలహాసంప్రదింపులకోసం ముఖ్యమంత్రి రెండు మూడు సార్లు ఢిల్లీ వెళ్ళడం అక్కడే దీర్ఘకాలం మకాం వేయడం, ఒకొక్కప్పుడు కొత్తమంత్రుల జాబితా ఢిల్లీనుంచే వెల్లడి కావడం, పైగా మంత్రివర్గ నిర్మాణ కార్యక్రమం ఇన్నాళ్ళు కొనసాగడం—ఇవన్నీ కొత్త నాయకత్వం ప్రభావం ప్రజలపైన సరిగా పడకుండా చేశాయి. ఈ స్థితి మారాలంటే కొత్తమంత్రివర్గం కనీసం నెలారెండునెలల్లో రాష్ట్రాన్ని ఎదుర్కొంటున్న ముఖ్యమైన సమస్యలను కట్టుదిట్టంగానూ, అందరికీ సంతృప్తికరంగానూ పరిష్కరించకలగడం పైన ఆధారపడి ఉంటుందని వేరే చెప్పనక్కర లేదు.

## ప్రధానమైనది తెలంగాణా సమస్య

ఇలా తక్షణం పరిష్కరించవలసిన సమస్యల్లో ప్రధానమైనది తెలంగాణాకు సంబంధించినది. మాజీ తెలంగాణా ప్రజాసమితి నాయకులు, మంత్రులు డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, శ్రీ కె. అచ్యుత రెడ్డి, శ్రీ మాణిక్‌రావు, శ్రీ జువ్వాది చొక్కారావు తెలంగాణా పార్లమెంటు సభ్యులు సిమ్లా. అ. భా. కా. సంఘం సమావేశం సందర్భంలో ప్రధాని ఇందిరాగాంధిని కలుసుకున్నప్పుడు కొన్ని విషయాలు స్పష్టపడ్డాయి. తెలంగాణా సమస్య పరిష్కారానికి ప్రధాని—డాక్టర్ చెన్నారెడ్డిగార్ల మధ్య జరిగిన చర్చల్లో రూపొందిన షష్ఠాంశ ప్రతిపాదన లన్నింటికీ, ప్రధాని సమ్మతించలేదని, ముఖ్యంగా తెలంగాణాకు ప్రత్యేక ప్రదేశ్ కాంగ్రెసు సంఘాన్ని ఏర్పాటుచేయడం, 1977 లో ప్రత్యేక రాష్ట్రం నిర్మాణంగూర్చి పునఃపరిశీలించడం —ఈ రెండింటి విషయంలో ప్రధాని తమ అంగీకారాన్ని తెలపలేదట. కాని ప్రజాసమితి కాంగ్రెసులో విలీనం కావడం కోసం ప్రజాసమితి నాయకత్వం చెప్పిన ప్రధాన కారణం ఈ ఆరుఅంశాల ఆధారంగా తెలంగాణా సమస్యాపరిష్కారానికి ప్రధాని అంగీకరించారనేది నిర్వివాదం. ఐతే ప్రధానికూడా సిమ్లా సమావేశంలో ఈ అంశాలతో తమకు సంబంధం లేదని చెప్పలేదని అందులో పాల్గొన్నవారందరూ ఒక కరీంనగర్, ఎం. పి. సత్యనారాయణరావుగారు తప్ప చెబుతున్నారు.

## ప్రధాని హితవు

తెలంగాణాకు ప్రత్యేక ప్రదేశ్ కాంగ్రెసు సంఘాన్ని ఏర్పాటు చేయడాన్ని కాసుబ్రహ్మానందరెడ్డిగారు కూడా వ్యతిరేకించారు. రాష్ట్ర సమైక్యతకు భంగం కలుగకుండా తెలంగాణా ప్రయోజనాల సంరక్షణకు కృషిచేయడానికి అంగీకరించిన ప్రజాసమితి నాయకత్వం, అందుకు దోహదం చేయని ప్రత్యేకకాంగ్రెసు సంఘం గూర్చి పట్టుపట్టడంలో అర్థం లేదు. పైగా తెలంగాణాకు ప్రత్యేక కాంగ్రెసు సంఘాన్ని ఏర్పాటుచేస్తే, ఇలాంటి కోరికలు గుజరాత్‌లోని సౌరాష్ట్రలోను, మహారాష్ట్రలోని విదర్భలోను తలెత్తుతాయి. కనుక ఆవిషయమై పట్టుదల చూపవద్దని ప్రధానమంత్రి హితవు చెప్పారట. అంతేకాక ప్రత్యేక కాంగ్రెసు సంఘాన్ని కోరుతున్నది, పార్టీ వ్యవస్థలోను, రాష్ట్ర రాజకీయ జీవనంలోను తెలంగాణాకు పూర్వంలోవలె అన్యా

18-10-71
నుండి
17-1-72
వరకు

# ఉచిత బహుమతులు

AT NO EXTRA COST




[illegible] ఖమ్మం జిల్లాలలోను

కృష్ణా, గుంటూరు, నెల్లూరు, [illegible] జిల్లాలలోను

[illegible] రాయలసీమలోని అన్ని జిల్లాలలోను
[illegible] రాయచూరు, బళ్లారి జిల్లాలలోను

## గోల్డ్ స్పాట్ - కిస్మత్

[illegible]




26-1-72 న

రాజమండ్రిలో జరిగే "డ్రా" లో క్రింది బహుమతులు యివ్వబడును

జావా మోటారు సైకిలు, 2 గోద్రెజ్ రిఫ్రిజిరేటరు...([illegible]), 5 రాలీ సైకిళ్లు
25 క్రోయోథాట్ర ఫ్లాస్కులు, 50 బ్రైట్ బ్రీఫ్ కేసులు. మొత్తము 83 గొప్ప
బహుమతులు. మరియు 150 గోల్డ్ స్పాట్ ఎయిర్ బ్యాగులు కన్సొలేషన్
బహుమతులు. మొదటి 3 బహుమతుల తాలూకు నెంబర్లు అన్ని
సిరీస్‌లలోని అవే నెంబర్లుకు కన్సొలేషన్ బహుమతులు యివ్వబడును.

మజా మజాగా ఉండండి
గోల్డ్ స్పాట్
తాగండి!

యం జరుగకుండా ఉండేటందుకే—కదా. సమైక్య కాంగ్రెసు సంఘంలోనే అందుకు తగు ఏర్పాట్లు, ముఖ్యంగా 1972 శాసనసభా ఎన్నికలకు అభ్యర్థుల ఎంపిక విషయంలో మీ హక్కుల పరి

## దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన ఆరు కథలు

1. అమ్మా, ఆకలేస్తోందే!
2. ఎదురీత
3. పాలు
4. మనోవ్యాధికి మందు
5. మాయమనసులు
6. వాన కురుస్తే!

# రాజధానికబుర్లు

రక్షణకు తగుచర్యలు తీసుకుంటామని కూడా ఆమె హామీ ఇచ్చారట. డాక్టర్ చెన్నారెడ్డి ప్రభృతులకు ఆమె ఇచ్చిన హామీ సంతృప్తికరంగా ఉంది. కాగా ఆంధ్రప్రదేశ్ అంతర్భాగంగా తెలంగాణా ప్రాంతీయ కాంగ్రెసు సంఘం పూర్వం కంటే హెచ్చు అధికారాలతో ఉంటుందనీ, ప్రదేశ్ కాంగ్రెసును పునర్వ్యవస్థీకరించేటప్పుడు, ఇందుకై కావలసిన చర్యలను తీసుకుంటారని తెలుస్తున్నది.

### కొత్త ప్రాణం

ఐతే ప్రత్యేక రాష్ట్రోద్యమాన్ని పునరుజ్జీవింప చేయడానికి కృషిచేస్తున్న శక్తులకు సిమ్లా సమావేశంలో ప్రధాని చెప్పిన మాటలు కొత్తప్రాణాన్ని పోశాయి. కాని తెలంగాణా ప్రజలు ఈ శక్తుల అండన ఎంతవరకు నిలుస్తారో భవిష్యత్తు మాత్రమే నిరూపించగలదు. ఇప్పటివరకు ప్రజల్లో అసంతృప్తి ఏమైనా ఉంటే బలంగా ఎక్కడా వ్యక్తం కాలేదు.

తెలంగాణా ప్రతిపాదనల్లో మరొక ముఖ్యమైనది ప్రాంతీయ సంఘానికి కల అధికారాలను విస్తృతం చేయడానికి సంబంధించినది. ఈ విషయంలో కేంద్ర నిర్ణయం త్వరలో వెల్లడికావచ్చును. తెలంగాణా ప్రయోజనాల పరిరక్షణకు తీసుకుంటున్న చర్యలపట్ల ఆంధ్రప్రాంత అభిప్రాయం ఎలా ఉంటుందో గమనించడం ఈ సందర్భంలో చాలా ముఖ్యమైనది. నరసింహారావుగారి మంత్రివర్గమూ, కేంద్రప్రభుత్వం కూడా ఆంధ్రప్రాంత ప్రజాభిప్రాయాన్ని ఒప్పించడానికి ప్రయత్నించడం చాలా అవసరమని వేరే చెప్పనక్కరలేదు. అప్పుడే ఇకముందు అభివృద్ధి అంతా తెలంగాణా, రాయలసీమల్లోనే జరుగుతుందనే అభిప్రాయం సర్కారు జిల్లాలో ప్రబలుతున్నది. దీనికి ఆధారం లేదనీ, ఒక వెనుకబడిన ప్రాంతపు అభివృద్ధి, మరొక ప్రాంతపు అభ్యుదయానికి ఆటంకం కావలసిన అవసరం లేదనీ నచ్చచెప్పాలి.

—వి. నాగేశ్వరరావు

# దీపావళి కథల బాలట్ పత్రం

**దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన ఆరు కథలలో నాకు ఉత్తమమని తోచిన వరుసలో ఆరు కథలు:**

| | |
|---|---|
| మొదటి కథ | |
| రెండవ కథ | |
| మూడవ కథ | |
| నాలుగవ కథ | |
| అయిదవ కథ | |
| ఆరవ కథ | |

పంపినవారి పూర్తిపేరు: ..............................

విరునామా: ..............................

..............................

..............................

ఆంధ్రసచిత్ర వారపత్రిక

# దీపావళి కథల బాలట్ పోటీ

## మొదటి బహుమతి రు. 250
## రెండవ బహుమతి రు. 200
## మూడవ బహుమతి రు. 150

# "నాకు నచ్చిన దీపావళి పోటీ కథలు"

*1971* దీపావళికి ఆంధ్రసచిత్ర వారపత్రిక నెలకొల్పిన దీపావళి కథల పోటీ వివరాలు ఇంతకిముందే ప్రచురించాము.

*ఈ సంచికతో ఉత్తమ కథలుగా ఎన్నికైన ఆరు కథల ప్రచురణ పూర్తి అవుతుంది.*

ఈ ఆరు కథలలో వరుసగా ఏవి ఉత్తమమైనవో నిర్ణయించి పాఠకులు ఎన్నుకునేందుకు ఒక బాలట్‌ని నిర్వహిస్తున్నాము.

బాలట్‌తోపాటు వ్యాసరచన పోటీని ఒకదానిని నిర్వహిస్తున్నాము.

పోటీకి వచ్చిన వ్యాసాలలో ఉత్తమమైన మూడింటికి వరుసగా రు. 250 మొదటి బహుమతి, రు. 200 రెండవ బహుమతి, రు. 150 మూడవ బహుమతి ఇవ్వబడతాయి.

ఈ పోటీకి సంబంధించిన ఇతర వివరాలు, నిబంధనలు ఈ కింద యిస్తున్నాము.

## ముగింపు తేదీ 15-11-1971

1. ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి సంచిక (22—10—71), ఈ సంచిక (29—10—71)లలో ఉత్తమ కథలుగా ఎన్నిక అయి ప్రచురింపబడిన ఆరు కథలలో పాఠకులు తమకి ఉత్తమమని తోచిన వరుసలో మొదటి కథ, రెండవ కథ, మూడవకథ, నాలుగవ కథ, అయిదవ కథ, ఆరవ కథలని ఎన్నుకుని, తమ ఎన్నికకి కారణాలని వివరిస్తూ 'నాకు నచ్చిన దీపావళి పోటీ కథలు' అన్న శీర్షిక క్రింద ఒక వ్యాసం రాసి పంపాలి.

2. పాఠకులు తాము ఉత్తమమని నిర్ణయించిన వరుసలో ఆరుకథలపేర్లని ఈ పేజీలలో యివ్వబడిన బాలట్‌పత్రంలో నింపి వ్యాసంతో పాటు పంపాలి.

3. పోటీకి పంపే వ్యాసం, ఒక అరఠావు (ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెండురెట్లు)ని మించి ఉండరాదు. సిరాతో రాసి ఉండాలి, కాగితానికి ఒక వైపే రాసి పంపాలి.

4. ఒక బాలట్ పత్రంతోపాటు ఒక వ్యాసంమాత్రమే పంపాలి. బాలట్‌పత్రాలు జతపరచని వ్యాసాలు పోటీకి స్వీకరింపబడవు.

5. ప్రతివ్యాసం ప్రాతప్రతిమీద, రాసిన వారి పూర్తిపేరు, చిరునామా ఉండాలి.

6. బాలట్‌పత్రంలో కూడా బాలట్‌పత్రం, వ్యాసం పంపేవారిపూర్తిపేరు, చిరునామా ఉండాలి.

7. కవరుమీదా, వ్యాసం ప్రాతప్రతిమీదా 'దీపావళి కథల బాలట్ పోటీ'కి అని స్పష్టంగా రాయాలి.

8. బాలట్‌పత్రం, వ్యాసం 'సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1'కి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు.

9. <u>పోటీ ముగింపు తేదీ 15—11—1971.</u>

10. పోటీకి సంబంధించిన తుది నిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపటానికి వీలులేదు.

11. ఎటువంటి పరిస్థితిలోనూ పోటీకి పంపిన వ్యాసాలు తిప్పి పంపబడవు.

12. బాలట్ పోటీ ఫలితాలు 24—12—1971 తేదీకల ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురింపబడతాయి.

13. ఇంతకిముందే ప్రకటించినట్లు బాలట్‌లో మొదటిదిగా ఎన్నికైన కథకి రు. 500, రెండవదిగా ఎన్నికైన కథకి రు. 450, మూడవదిగా ఎన్నికైన కథకి రు. 400, నాలుగవదిగా ఎన్నికైన కథకి రు. 350, అయిదవదిగా ఎన్నికైన కథకి రు. 300, ఆరవదిగా ఎన్నికైన కథకి రు. 250 ప్రత్యేక బహుమతులుగా ఇస్తాము.

పాఠకులందరూ మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

# ఒక వారం విపరీతం
## ఫాలాక్షుడు

### తల్లి తల పగలకొట్టిన తనయుడు !

అలహాబాదుకు చెందిన మనేరి అనే వూరిలో భూమిపంపకం విషయంలో కోపంవచ్చిన నో బుద్ధిమంతుడు చేతికందిన లాటీతో తనతల్లి బుర్ర పగలగొట్టి చంపి, కాలికొద్దీ పారిపోయాడట. ఈ పరశురామునికోసం పోలీసు వెతుకులోంది.

### వ్యభిచారంలో కూడా కలకత్తా అగ్రతాంబూలం !

వ్యభిచారానికి రానురానూ కలకత్తా అగ్రతాంబూలం కొట్టేసేలా కనుపిస్తోందని స్వామిసిద్ధానంద అన్నారట. ఈయన గత 45 ఏళ్ళుగా ప్రపంచమంతా పర్యటిస్తున్నారట. హిందూమహా సంస్థకు చెందిన యీ స్వామి ప్రజా క్షేమము, వ్యభిచారము, దాని వలన కష్ట నష్టములు అనేవిషయాలమీద పరిశోధన చేస్తున్నారట. కలకత్తాలో వ్యభిచారం చేయడానికి దేశంలోని అన్ని రాష్ట్రాల నుంచీ అమ్మాయిలు వచ్చి స్థిరపడుతున్నారని కూడా యీయన అన్నారట— సత్యంశివం.




### అమ్మాయిని అపహరించిన అన్నా చెల్లెళ్ళు

ఢిల్లీ కన్నాట్ ప్లేస్‌లోని ఒక హోటల్లో టెలిఫోను ఆపరేటరుగా పనిచేస్తున్న లోరీనా అనే ఆమెను ఎత్తుకు పోయిన నేరానికి బొంబాయికి చెందిన రాజు దీపక్ అనే అతనిని అతని చెల్లెలు నూర్జహాను పార్లమెంటు వీధి పోలీసులు నిర్బంధంలోకి తీసుకున్నారట. ఈ అన్నా చెల్లెళ్ళిద్దరూ డ్యాన్సు చేస్తారట. తనకూతురికి సినిమాలో ఛాన్సు యిప్పిస్తానని మభ్యపెట్టి ఎత్తుకుపోయారని వారిద్దరిమీదా లోరీనా తల్లి ఫిర్యాదు చేసిందట.

*  *  *

కన్నాట్‌ప్లేస్—ఢిల్లీ—లో 27వ తేదీన రాత్రి 7 గంటలకు మూసి, 28వ తేదీ పండుగ శలవు అనంతరం 29వ తేదీ 10 గంటలకు నోషాపు యజమాని తన షాపు తెరిచి చూస్తే సుమారు లక్ష రూపాయలు కిమ్మతు చేసే వస్తువులు పోయినట్లు తేలిందట. ఆషాపులో బాగులకు వచ్చిన చేతి గడియారాలు, వెండి వస్తువులు, నగలూ అన్నీ ఎవరో ఎత్తుకు పోయారట. ఆషాపు వెనుక భాగంలో వున్న తలుపులు పగలగొట్టి దొంగలు కొట్లోకి ప్రవేశించారని పోలీసు పసిగట్టేసిందట, హ్హ్ రరే!




*  *  *

డబ్బు తగువు తీరక ఢిల్లీ కైలాష్ నగర్‌లో నో రిక్షావాడు 18 ఏళ్ల రాజకుమార్ అనే అతన్ని కత్తితో పొడిచి, పారిపోయాడట.

*  *  *

హిందూదేశంలోని బంగ్లాదేశ్ కాందిశీకుల గుంపు చూసిన ఎడ్వర్డ్ కెనడీ ఆకాందిశీకులిగ్గాను మన దేశానికి 400 మిలియను డాలర్లు [ 300 కోట్ల రూపాయలు ] యివ్వవచ్చుని అన్నారట. విన్నారా!



రామవిజేతా ఫిలింస్

# రామాలయం

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం
కె. బాబూరావు

నిర్మాత
కె. ఎ. ప్రభాకర్

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి —

**పి. వి. జి, మదనపల్లె**

మీరు ప్రశ్నలకు యింత చురుకుగా సమాధానాలిస్తారు. ఇందులో మీ శ్రీవారి సహాయం కూడా ఉందా ?

లేదు. వారిది ప్రథమ కోపంకాదు. ఆలోచించి కోపం తెచ్చుకునేవాళ్ళు— యీ పని చెయ్యరు!

**కె. ఎస్. ఎమ్, తుని**

మీ యింట్లో మీరే వంట చేస్తారా ? లేక...

వంటిల్లు ఆడదాని సామ్రాజ్యం. అధికారంలేని ఎవరేనా పూనుకుని వంటకి దిగితే విసుగురాదూ? అంచేత నేనే తాపత్రయపడతాను. ఎంత రచయిత్రి నైనా ఆకలి వేస్తుంది కదా!

**సిహెచ్. ఆర్. బి, శ్రీహరిపురం**

మానవునికి భయం ఎందువల్ల కల్గుతుంది ?

తెలిసో తెలియకో చేసిన తప్పులవల్ల.

**పి. బి. ఆర్, కలికిరి**

బతికి ఉండగా సానుభూతి చెప్పని యీ దేశ ప్రజ మరణించాక ఎంతో అభిమానాన్ని కనుపరుస్తారు "అయ్యో పాపం." అని ఎందుకు ?

సులువు కనుక. బతికున్న మనిషికి ఒక్క సానుభూతి కాదు కావలసినది— చేయూత. చచ్చినవాడికి సానుభూతి చాలు.

**వి. ఎన్. ఎస్, మంథెన**

హెచ్. ఎస్. సి. పాసయ్యాను. విశ్వ ప్రయత్నం చేశాను. ఉద్యోగం దొరకలేదు. వివాహం కూడా జరిగింది...

బహుశా వివాహం కోసం చేసుంటారు విశ్వ ప్రయత్నం?!

**వి. ధర్మజీ, పాలకొల్లు**

చిన్నపిల్లలు దేవుళ్ళతో సమానం అంటారు కదా. మరి పెద్దవాళ్ళు ?

పిల్లల దృష్టిలో దెయ్యాలతో సమానము!

**ఎమ్. జె. ఎల్, పందలపాక**

మాటకు మనుగడకు గల నిష్పత్తి ఏమిటి ?

మనుగడ ఒకటైతే— మాటపొలికే

మానవుని ఆశ ధనము మీదా? ప్రాణము మీదా ?

ప్రాణ ధనముల రెండిటి మీదా.

**కె. జి. ఎస్, తుని**

సినిమాలో చేరే అర్హతలన్నీ వుండి కొంచెం నల్లగా వుంటే చేర్చుకుంటారా?

మహరాజులాగా. కాని అర్హతలు అన్నీ మీరే నిర్ణయించుకున్నవి కాకూడదు!

**వె. శ్రీ. బి, కొత్తూరు**

మొన్న తెల్లవారుజామున నాకో కల వచ్చింది. మీరు మీ శ్రీవారిని అప్పడాల కర్రతో... తెల్లవారుజామున వచ్చిన కల నిజమవుతుందంటారు ?

నీ కల నిజపరచకుండా ఎలాగ? ఇదిగో పరుగెడుతున్నా బజారుకి!? అప్పడాల కర్ర తేడానికి!!

**టి. ఎమ్. ఆర్, గూడవల్లూరు**

దేవుడే సృష్టికి మూలకారణం కదా. మరి మానవులందరినీ సమానంగా ఎందుకు సృష్టించలేదు ?

దేవుడు శిల్పి. మిషన్ కాదు—ఒకే మూసలో పోసినట్టు సృష్టించడానికి. సృష్టిలో ఈ వైవిధ్యమే లేకుంటే ఎంత బోర్‌గా ఉంటుందో ఆలోచించి చూడు చిట్టితల్లీ—

**ఎ. వి. ఏ, భోంగిర్**

తల్లితండ్రులు ముఖ్యంగా పుత్రులనుండి ఆశించేది నిర్మలమైన నిష్కపటమైన ప్రేమ...డబ్బు కాదు.

అదెక్కడుంటుంది సార్?!

**కళ్యాణశ్రీ, కోవెలకుంట్ల**

మీకు విగ్రహారాధన మీద నమ్మకం వుందా ?

నేను చాలా మామూలు మనిషిని. ఎదుట బొమ్మ ఉంటే తప్పించి— ఏకాగ్రతతో క్షణం సేపైనా చేతులు జోడించి నిలబడి ప్రార్థించలేను.

**ఎన్. ఎస్, విశాఖపట్నం**

సృష్టిలో విలువైనది ఏదండీ?

తీయకుండా వుంటే— ప్రాణం బాబూ.

**వై. ఆర్. కె, తాళ్ళూరు**

నేను జీవితకాలంలో భూమిచుట్టు ప్రదక్షిణంచేసి రాగలను ?

ఎందుకు గుడ్డిఎద్దు చేలోపడ్డట్టు— అలా భూమి చుట్టు తిరిగిరావడం?! అట్లాసు ముందెట్టుకుని నేను క్షణంలో చుట్టి వస్తాను.

**కే. ఎమ్. వి, హుజూరాబాదు**

కొందరికి జీవితం అంటే అసహ్యాను. ఎందుకని?

వారు కోరుకున్నట్టు సాగకపోవడంవల్ల.



# మనోవ్యాధికి మందు



[illegible]నేని వెంకటనరసింహారావు

'జెనరేషన్ గేప్' ఈ తరం వాళ్ళకే అంతు చిక్కని చిక్కు సమస్య. భాగ్యమ్మ పూర్వకాలపు మనిషి. ఆవిడకేం బోధపడుతుంది?

భాగ్యమ్మ వాలు కుర్చీలో కూర్చొని ఆకాశం వంక చూస్తోంది. ప్రకృతిని చూస్తూ గంటలకు గంటలు గడపడం అలవాటు చేసుకుంది. లేకపోతే కాలం గడిచేదెలా?

'నా కొడుకుతో మాట్లాడి ఎన్నాళ్ళయింది?' భాగ్యమ్మ ప్రశ్నించుకుంది.

'గుర్తు లేదు' అనే జవాబు చెప్పుకుంది. మాట్లాడవలసిన అవసరం ఏముంటుంది? వాడి బిజినెస్ వ్యవహారాలు తన కర్థం కావు. ఇంటి వ్యవహారాలు కోడలు చూసుకుంటుంది. కాస్త కూస్త పనుంటే నౌకర్లే చేసుకుపోతారు. తనకు కాలు కదిపే పని లేదు. మరో వ్యాపకమూ లేదు. ఒంట్లో సత్తువుండి పని లేకపోవడమూ ఒక సమస్యే. భాగ్యమ్మకీ ఒంటరితనం భరింపరానిదిగా వుంటోంది.

భాగ్యమ్మ నాలుగయిదేళ్ళ క్రితం వరకూ చాల బిజీ మనిషి. మనుమలూ, మనుమరాళ్ళకూ వండి పెట్టడం, స్కూళ్ళకూ, తరువాత కాలేజీలకూ పంపడం — తనకు చేతినిండా పని. ఒక్క క్షణం తీరికుండేది గాదు. వాళ్ళకు తను చేతనైన చాకిరీ చేయగల్గుతున్నందుకు ఆనందమూ తృప్తీ వుండేవి. వాళ్ళంతా తన చేతులమీదుగా పెరిగినవాళ్ళే! ఇప్పుడెంత పెద్ద కబుర్లు చెప్పినా వీళ్ళంతా తన పేదరాసి పెద్దమ్మ కథల్ని శ్రద్ధగా విన్నవాళ్ళే!

ఇప్పుడు పెరిగి పెద్దవాళ్ళయిపోయి తలో చోటా వుంటున్నారు. ఎప్పుడో పండగలకూ పబ్బాలకూ అవసరమయితే రావడం, లేకపోతే అదీ లేదు. అంతంత ఇంట్లో కొడుకూ కోడలూ, తనూ.

'అమ్మడూ నీ కొడుకు నంచేసి వెళ్ళు నేను జాగ్రత్తగా పెంచుతాను' క్రింద సారి ఢిల్లీ మనుమరాలొచ్చినప్పుడు ప్రా పడుతూ అడిగింది భాగ్యమ్మ. మన నిర్మొహమాటంగా చెప్పేసింది—

రంటే పిల్లలకు చదువు రాదంటూ సుందరం బొంబాయి నుండి కూతురికోసం ప్రయత్నించి విఫలమయింది. బాధపడి వూరుకుంది. అంతకంటే తనేం చెయ్యగలదు? తన అవసరం ఎవరికీ లేదు.

తనొక ఎండి మోడైపోయిన చెట్టు. మోడైపోయిన చెట్టు పొయ్యిలోకైనా పనికొస్తుంది. తనవల్ల అంత మాత్రం వుపయోగం కూడా లేదు.

అందుకే జీవితం నిస్సారంగా కనిపిస్తోంది. తనూ తనింక బ్రతికి వుండటం అర్థంలేదని భాగ్యమ్మ అభిప్రాయం.

'ఎందుకు బ్రతకాలి? ఎవరికోసం?' ఇవే ప్రశ్నలు. జవాబు దొరకని ప్రశ్నలు.

కాలం కొన్నివేల సంవత్సరాలు నత్తనడక నడిచి ఒక్కసారి పరుగు లంకించుకుంది. భాగ్యమ్మ నత్తనడక కాలానికి ప్రతినిధి. తన అమ్మమ్మ ఎలా సంసారం చేసిందో తన అమ్మా అలాగే చేసింది పెళ్ళి చేసుకోవడం, పిల్లల్ని కనడం, గొడ్డులా ఇంటెడు చాకిరీచేసి 'ఫలానా ఇంటి ఆడబిడ్డ' అనే మెప్పుకోసం ప్రయత్నించడం—ఇదే పరిధి. తన సంసారమూ అంచుమించు అంతే! ఇలా కొన్ని తరాలు రబ్బరు స్టాంపుల్లా జరిగిపోయినవి. ఈ పాతిక, ముప్పై సంవత్సరాల్లో ఎంత మార్పు?

'ఆ రోజుల్లో ప్రేమలే వేరు.' అనుకుంది భాగ్యమ్మ. ఒకరికి కష్టమొస్తే పదిమందీ పంచుకున్న రోజులు అవి. ఇప్పుడెవరి కష్టం వాళ్ళది. ఆ రోజుల్లో మనుషులెంత హాయిగా నవ్వుతూ వుండేవారు? ఇప్పుడెవరి మొఖాన చూసినా నవ్వు కనిపించదు. మనుషుల్లో మేడిపండు మర్యాదలు పెరిగినవి. పెళ్ళాం మొగుడితో మితంగా మాట్లాడితే నాగరికత. పిల్లలు తల్లిదండ్రులతో ఆచి తూచి గౌరవంగా మాట్లాడాలి. మితంగా నవ్వాలి. మితంగా ఏడవాలి. అంతా లిమిట్స్.

'టెలిగ్రామ్...' పోస్ట్‌మేన్ పిలుపు.

భాగ్యమ్మ ప్రపంచంలో కొచ్చి వులిక్కిపడింది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నవి. కొడుకూ కోడలూ ఇంట్లో లేరు. టెలిగ్రామ్ తీసుకుని పొరుగింటి కెళ్ళింది. సుందరమ్మ మనుమడు రామారావు చదువుకుంటున్నాడు.

'బాబా రామూ! ఈ టెలిగ్రామ్

# మనోవ్యాధికి మందు

చూడు...' కంగారుగా అడిగింది. రామూ కవరు చించి, చదివి నవ్వుముఖం పెట్టాడు.

'మామ్మా! నీకొక మంచి కబురు చెబుతాను. ఏమిస్తావ్? ఉలవచారు కాచి పెడతావా?'

'తొందరగా చెప్పరా బాబూ! నా కేదో దడగా వుంది.'

'అలా కాదు. నువ్వు 'ఊ' అంటేనే.'

'సరే.'

భాగ్యమ్మ తన స్వంతవాళ్ళకే గాదు. ఆ పేటంతటికీ మామ్మే.

'ప్రసాద్ అమెరికా నుండి వచ్చేశాడట. ఈ రోజు మెయిల్లో మద్రాసు వెడుతున్నాడు. మిమ్మల్ని స్టేషన్లో కలుసుకోమన్నాడు.'

భాగ్యమ్మ ముఖం వెలిగిపోయింది. నోటి నుండి మాట పెగిలి రాలేదు. టెలిగ్రామ్ తీసుకుని గిరుక్కున వెనక్కి తిరిగింది.

'మామ్మగారూ! ఉలవచారు...' భాగ్యమ్మ వినిపించుకోక పోవడం ఆమె తప్పుకాదు.

భాగ్యమ్మకు ముళ్ళమీదున్నట్లుగా వుంది. ఏం చెయ్యాలి? సమయానికి

## ఎవరి కొరకు?

ప్రభాత ప్రభంజనమున
మంచులోన జలకమార్చి
మృదువుగాల్పు చూపులతో
ఎదురు చూతు వెవరికొరకు?

చివురాకుల జొంపములో
సురిరేకుల కనులు విప్పి
తొలి తేనెలు పొంగిపొర్లు
ఎదురు చూతు వెవరి కొరకు?

అరుణారుణ కాంతిజల్లి
మల్లెపూల ముగ్గు లేసి
జాజిపూల పాన్పు పరిచి
ఎదురు చూతు వెవరికొరకు?

చిరుచీకటి చీరకట్టి
చుక్కలున్న రవిక తొడిగి
మేలిమబ్బు ముసుగువేసి
ఎదురు చూతు వెవరివెకొరకు?

—కృష్ణప్రియ

కొడుకూ కోడలూ ఇంట్లో లేకపోతిరి. రేపటిగ్గాని రారు. ఊటెత్తేవే ఇల్లంతా తిరిగేసింది.

మెయిలు రాత్రి తొమ్మిదిన్నరకు. అప్పుడే ఆరుదయిపోయింది. భాగ్యమ్మ మనవణ్ణి చూసి మూడు సంవత్సరాలయింది.

'ఎలాగున్నాడో పిచ్చి సన్నాసి? వాడికి కొడుకు కూడా పుట్టాడట. నిన్న మొన్నటి పెధవ. అప్పుడే వాడికి పిల్లలు' అనుకుంది భాగ్యమ్మ. మునిమనుమడి గుర్తు రాగానే భాగ్యమ్మకు వొళ్ళు పులకరించింది. వెంకటేశ్వరస్వామి ఫోటో ముందు నిలబడి దణ్ణం పెట్టుకుంది.

'ఇంకా నాకేమి వొద్దు స్వామీ! ఈ జన్మకీ భాగ్యంచాలు' అనుకుంది. ప్రసాద్ భాగ్యమ్మ కూతురి కొడుకు. అల్లుడు ఉద్యోగరీత్యా అనేక వూళ్ళు మారుతూ వుండటం వల్ల పిల్లల్ని విశాఖపట్నంలో పెట్టుకుని చదివించింది. అసలు పిల్లలకు చదువు చెప్పించడమంటే ఆమె కెంతో సరదా. దగ్గర కూర్చుని మరీ చదివించేది. పిల్లలంతా బాగా చదివి గొప్పవాళ్ళు కావాలి అదే ధ్యేయం. ఆ సబ్జెక్ట్ అంతుచిక్కక గాని లేకపోతే ఈ మేష్టర్లకూ, లెక్చరర్లకూ పాఠాలు నేర్పగల సమర్థురాలు.

'ఈ వయసులో ఎందుకు భాగ్యమ్మా నీకీ బాదరబందీ' ప్రక్కింటి సుందరమ్మ సలహా యిస్తుండేది. ఏమి విచిత్రమో గాని ఆవిడకు పిల్లలంటే బొత్తిగా పడదు. ఒక్కడే కొడుకయినా మొగుడుపోగానే మనోవర్తి తీసుకుని వేరే వుంటోంది. పిల్లల చదువు ఇబ్బందిగా వుందనీ, వాళ్ళని పెట్టుకుని గుడివాడలో వుండవలసిందని కొడుకు ప్రాధేయపడ్డాడట.

'అత్య విచారం కన్నా అది విచారం మేలు. ఈ బాదర బందీ నేను పెట్టుకోను.' అని ఖండితంగా చెప్పిందట సుందరమ్మ. అలాగని చెప్పడమే కాదు భాగ్యమ్మకు కూడా హితవు చెప్పింది.

'వీళ్ళంతా పెరిగి పెద్దవాళ్ళయి మనల్ని వుద్ధరిస్తారేమిటి?' అని. తనకలా అనిపించదు. తన ఒంట్లో శక్తి వున్నంత వరకూ తన వాళ్ళకు సాయపడటమే తనకానందం. తృప్తీనూ. వీళ్ళు వుద్ధరిస్తారనే తలంపు తనకెప్పుడూ వచ్చేదిగాదు. ప్రతిఫలాన్ని కోరిజూసి తూనిక

రాళ్ళతో తూచడం తన చేతగాదు.

మొదట్నించీ ఈ మనవడంటే భాగ్యమ్మకు ప్రత్యేకమైన అనురాగం. మిగతా వాళ్ళకు పెసరట్లు మామూలుగా వేసి ఈ మనవడికి నేతితో వేసేది. మిగతా వాళ్ళకు నాలుగు నాలుగు జ్వరమొచ్చినా లెక్కచెయ్యని భాగ్యమ్మ ప్రసాద్ వొళ్ళు కొంచెం వేడిగా వుంటే వొణికిపోయేది. అంతా తనవాళ్ళే అయినా ఈ మనవడి మీదింత ప్రత్యేకతేమిటి?

భాగ్యమ్మకే ఆశ్చర్యంగా వుండేది.

'అరెరె! ఇలా మంచుండి పోయానేమిటి? అవతలటయి మయిపోతోంది!' అనుకుంది భాగమ్మ. గబగబా వెళ్ళి మినపప్పు నానబోసింది. గారెలంటే వాడికిష్టం మినపప్పు నానేలోగా అల్లంపచ్చడి చేసింది. పప్పు రోట్లోవేసి గబగబా రుబ్బేసింది. అసలీ మధ్య ఇలాంటి పనులేమీ భాగ్యమ్మ చెయ్యడం లేదు. కాస్త పనిచేస్తే ఆయాసం. దడ. మనవడికోసం అవేమీ గుర్తుకు రాలేదు. వయసు ఇరవై సంవత్సరాలు తగ్గినట్టు పిలయి పనులన్నీ గిరగిరా చేసుకుపోయింది.

గారెలూ, అల్లం పచ్చడీ టిఫిన్ కేరియర్లో సర్ది స్టేషనుకి వెళ్ళింది.

ప్రసాద్ దగ్గరే వృద్ధాప్యం గడపాలనీ వాడిదగ్గరే తనువు చాలించాలనీ భాగ్యమ్మ

# మనోవ్యాధికి మందు

కోరిక. అందుకే ప్రసాద్ అమెరికా వెడుతున్నప్పుడు వుండబట్టలేక అడిగేసింది 'ఒరేబాబా! నే నెక్కువకాలం బ్రతకన్రా. నన్ను నీతో తీసుకెళ్ళరాదూ?' అంటూ కంట తడిబెట్టింది. అంతా నవ్వేశారు. ఆటలు పట్టించారు.

'అమమ్మా! అమెరికా వెళ్ళి గౌనులు వేసుకోవాలనుందా?' అన్నారు. తనబాధ వాళ్ళ కర్థంకాదు.

'అమ్మమ్మా నేను వెడుతున్నది కార్డియాలజీలో రిసెర్చి చెయ్యడానికిగ్గాదు. నీ కాళ్ళనొప్పుల్ని పరిశోధించడానికి' ప్రసాద్ వెడుతూ అన్న వోదార్పు మాటలు గుర్తొచ్చినప్పుడల్లా భాగ్యమ్మ మనసు హాయిగా వుంటుంది. తన కాళ్ళనొప్పులు వాడికి గుర్తుండటమే చాలు. ఇంకా ఈ వయసులో తనకు మందులూ మాకులూ కావాలా? వాడి చల్లటి మాటలే వెయ్యిమందుల విలువ.

భాగ్యమ్మ హడావుడిగా అన్నీ సర్ది ఇంటికి తాళం వేసేసమయంలో డబ్బుసంగతి గుర్తుకొచ్చింది. తనదగ్గర మామూలుగా డబ్బుండదు. తనకిలాంటి అవసరం వొస్తుందని కొడుక్కేం తెలుసు? ఒక్కరోజులో డబ్బు అవసర మేముంటుంది గనుక?




భాగ్యమ్మ అలమారలన్నీ వెతికింది. రెండు రూపాయల చిల్లర కనిపించింది.

'పొరుగింటికెళ్ళి నో అయిదు రూపాయలు బదులడిగితే?' చిన్నతనం అనిపించింది. కొడుకునీ, కోడలినీ క్రూరంగా చెప్పుకుంటారు. ముసిలిదానికి అమాత్రం స్వాతంత్ర్యం లేకుండా చెయ్యడం న్యాయం కాదని ధర్మపన్నాలు చెబుతారు. తనగురించి ఒకళ్ళు జాలిపడటం తనకు నచ్చదు. భాగ్యమ్మ అభిమానం అలాంటిది.

గడియారం ఏడుంపావు చూపుతోంది. ఇహ ఆలస్యం చేస్తే పుణ్యకాలం కాస్తా దాటిపోతుంది. రెండు రూపాయల చిల్లరా తీసుకుని భాగ్యమ్మ బయలుదేరింది.

రిక్షాలెక్కడా కనుచూపు మేరలో లేవు. భాగ్యమ్మ నడక ప్రారంభించింది. శ్రీనివాసా వర్కింగ్ హోమ్‌వరకూ నడిచింది

'రిక్షా స్టేషను కొస్తావా?'

'రండమ్మా! రండి,'

'ఎంత?'

'రూపాయివ్వండి. రండి కూర్చోండి.'

'అర్ధరూపాయిస్తాను. వస్తావా?' అంది.

'అర్ధరూపాయా? బిల్లెల్లవమ్మా! ఎప్పుడన్నా రిక్షా ఎక్కావా?' భాగ్యమ్మ గతుక్కుమంది. ఎంతమాటన్నాడు వెధవ? అయినా వాడితప్పేముంది? వాడికంటికి తనలా కనిపించింది గాబోలు? ముసలితనం అందరికీ తేలికే.

ఛీ...ఛీ...వీడితో నాకేమిటి?' అనుకుని ముందుకు నడిచింది. వీడన్నంతమాత్రాన తనహోదా తగ్గిపోతుందా? తన కొడుకు లక్షాధికారి కాకపోతాడా? తన అల్లుడు అదేదో ఆఫీసరు—గుర్తుండి చావదు—కాకపోయాడా? భాగ్యమ్మకు వెనక్కి తిరిగి రిక్షా వాణ్ణి పిలవాలనిపించింది. పిలిచి 'అమెరికా ఎక్కడుందో తెలుసా?' అని అడగాలనిపించింది. వాడిమొఖం వాడికేం తెలుస్తుంది 'అక్కడ చదివి పెద్ద డాక్టరై తిరిగొస్తాడు నా మనవడు' అని గర్వంగా చెప్పాలనిపించింది.

భాగ్యమ్మ విజయాటాకీస్‌వరకూ నడిచింది. ఏలూరురోడ్డు చీకటిగా లాడుతూ వుంది.

'టైమెంత బాబా?'

'ఏనిమిది.'

'అమ్మయ్యో ! టయిమయిపోయింది. రిక్షా.. రిక్షా...'

'రండమ్మా ! రండి.'

'స్టేషను కెంతిమ్మంటావ్ ?'

'ముప్పావలా'

'సరే' బేరమాడటానికి సమయంకాదు. భాగ్యమ్మ పుమారుమంది.

రెండు రూపాయల్లో, ముప్పావలా పోతే? రూపాయి పావలా. ప్లాటుఫారం టిక్కెట్టు ఇరవై పైసలు. తిరుగు రిక్షాకు ఏంత లేదన్నా మరో ముప్పావలా. ఇహ మిగిలేది మిప్పై చిల్లర డబ్బులు. ఈ చిల్లరతో వాళ్ళకేం తీసుకెళ్ళగలదు ? వాడు అమెరికా నుండి తిరిగొస్తూ వుండొచ్చుగాక ! పెద్ద డాక్టరే కావచ్చు. తరువాత లక్షలు సంపాదించొచ్చు. కానితను పెద్దది. తనకళ్ళకివాడెప్పుడూ పసివాడే. పసివాడికి పాలిస్తే తల్లికానందం. తనకూ అంతే. తన చేతుల్తో వాడికి తినిపిస్తే తనకు తృప్తి. ఒట్టిచేతుల్తో వెడితే ఏదో వెలితిగా వుంటుంది.

'ఛీ...ఛీ...సమయానికి తనవద్ద డబ్బు లేకపోయె' జీవితం లిన్నడూ లేనంత విరక్తావహంగా కనిపించింది.

రిక్షా తాలూకాఫీసుదాటి ఆంధ్రపత్రిక ఆఫీసు చేరుకుంటోంది. పళ్ళ దుకాణాలు భాగ్యమ్మ ఆలోచనల కంతరాయం కలిగించినవి.

'ఆపబ్బాయ్. ఆపు......' రిక్షా ఆగింది.

'ఉండు. వస్తాను...' అంటూ రిక్షా దిగి పళ్ళ దుకాణంవైపు నడిచింది. రకరకాల పళ్ళు ఏ రకానికారకం అందంగా అమర్చబడి వున్నవి. భాగ్యమ్మ దృష్టి ఆపిల్సుమీద పడింది. పళ్ళు నవనవలాడుతూ మెరుస్తున్నవి. అంతలోనే భాగ్యమ్మలో విరుత్సాహం ముంచుకొచ్చింది.

'లాభంలేదు. డబ్బులు చాలవు...'అను కుంది. దృష్టి చెక్కరకేళి గెలమీద పడింది.

'అవీ ఖరీదెక్కువే'

బత్తాయిలూ, కమలాలూకూడా అంతే. తనకందుబాటులో వుండవు. చివరకు ఓ రడజను అరటిపళ్ళు కొని రిక్షాలో కూర్చుంది.

'తొందరగా పోనీ అబ్బాయ్. మెయిలొచ్చే టయిమయింది' హెచ్చరించింది...

భాగ్యమ్మ రిక్షాదిగి బుకింగ్ ఆఫీసు వైపుకు నడిచింది.

'ప్లాటుఫారం టిక్కెట్టెక్కడిస్తారు బాబూ?'

'అదుగో ! అక్కడ.'

ప్లాటుఫారం టిక్కెట్టు తీసుకుని లోపలి

(కిక్కిరిసి మెరుపుల్లా తోంది. చిన్నల్లా జనం వందలూ...వేలు...

పరుగులు...ఉరుకులు...

కూలీల అరుపులు...ఇంజన్ల మోత...

అంతొంద్నిగా వుంది.

'మెయిలొచ్చేసిందా?' భాగ్యమ్మ ఆత్రంగా అడిగింది.

'వచ్చి పావు గంటయింది'

'అమ్మయ్యో!' భాగ్యమ్మ వేగం హెచ్చించింది.

ఆయాసం.. దడ...

భాగ్యమ్మ శక్తినంతటినీ కూడదీసుకుని పరుగెత్తడానికి ప్రయత్నించింది. ఆరాటం వున్నా పరుగెత్తడానికి ముసలి శరీరం మొండికేస్తోంది. అడుగువడటం కష్టంగా వుంది.

భాగ్యమ్మ కొంచెం సేపాగింది. ఆయాసం మరీ ఎక్కువయింది. గుండెలు దబ్ దబ్ మని కొట్టుకుంటున్నవి. వొళ్ళంతా చెమట. ఉక్కిరిబిక్కిరిగా వుంది.

భాగ్యమ్మకు భయం వేసింది. తను చచ్చిపోతుందేమో? తన చావు ఇలా రాసిపెట్టి వుందేమో? అలా కాకూడదు. ఒక్కరోజు... కాదు కాదు... ఒక్క గంట...అరగంటయినా ప్రాణం నిలిస్తే చాలు. మనవణ్ని చూశాక తృప్తిగా ప్రాణం విడవడానికి సిద్ధం. ఒక్కసారి వాణ్ని చూడాలి. వాడి మెత్తటి బుగ్గలు నిమరాలి. ముద్దుపెట్టుకోవాలి... అంతే! అంతకన్నా వేరే కోరుకోదు.

కనకదుర్గ గుడివైపు తిరిగి దణ్ణం పెట్టింది. మనసులో ఏదో కోరుకుంది. ఆయాసం కొంచెం తగ్గినట్లుగా వుంది. ఓవర్ బ్రిడ్జి మెట్లెక్కి, కొంతదూరం తిన్నగా నడిచి మళ్ళీ మెట్లు దిగితేగాని ప్లాటుఫారం రాదు.

మెట్లు దిగుతోంటే భాగ్యమ్మ కాళ్ళు వొణికి పోతున్నవి. ప్రక్కనే హేండ్రెయిలింగ్ పట్టుకుని ఒక్కొక్క మెట్టు దిగటానికి ప్రయత్నించింది. లాభం లేదు. సమయానికి కాళ్ళు చచ్చుబడిపోయినవి. మెట్లెలా దిగటం?

యుద్ధంలో కర్ణుడి సర్వాస్త్రాలూ నిష్ప్రయోజనం అయి చివరకు రథం కూలిపోయినట్లుంది తన పరిస్థితి. అలా కాకూడదు...భగవంతుడా?...'

'బాబూ మెట్లు దిగలేక పోతున్నాను. కొంచెం సాయం చేస్తావా?'

'హూఁ...' విదిలించుకుంటూ వెళ్ళాడొక సూటు మనిషి. భాగ్యమ్మ బ్రతిమాలింది. విననట్లు

# మనోవ్యాధికి మందు

నటించి వెళ్ళిపోయాడు.

'అమ్మా మెట్లు దిగలేకపోతున్నాను... కొంచెం సాయం...'

'ఎముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన ముసలిదానా! చావు' అన్నట్లు ఈ నడుచుకుంటూ వెళ్ళిపోయిందొక కాలేజి పడుచు. ఇంతమంది జనంలో తన గోడు ఒక్కరూ వినిపించుకోడం లేదు. ఎవరి గొడవ వాళ్ళది. ఎవరి హడావుడి వాళ్ళది. పొరుగువాడి కష్టం మరొకరికి అనవసరం. అన్నసత్రాలూ, చలివేంద్రాలూ వెలిసిన రోజులు పోయినవి. ఆరోజులకు ప్రతినిధి భాగ్యమ్మ. ఈ రోజులు మనుషుల్ని మనుషులు పీక్కుతినే రోజులు. మందినీళ్ళు అమ్ముకునే రోజులు. మనుషుల్ని, మంగళ సూత్రాల్నీ అమ్ముకునే దౌర్భాగ్యపు రోజులు...

భాగ్యమ్మ కాళ్ళు కదలనివ్వడం లేదు. ఒక మెట్టుమీద కూర్చుండి పోయింది.

'దేనికైనా ప్రాప్తముండాలి' భాగ్యమ్మ బాధతో మూల్గింది. గట్టిగా ఏడవాలనిపించింది. ఆశ్చర్యం? ఏడుపూ రానడం లేదు. మనసు బండబారి పోయింది.

భాగ్యమ్మ లేచి నిలబడి మరో ప్రయత్నం చేసింది. రెండుమెట్లు దిగాక మళ్ళీ మొదలు. కాళ్లు కదలనివ్వడం లేదు.

'అవ్వా! నా చెయ్యి పట్టుకో నేను దిగబెడతాను.' ఒక పన్నెండేళ్ళ కుర్రాడు, మాసిపోయిన బట్టలు ... లోతుకుపోయిన కళ్ళు...చింపిరి జుట్టు...డొక్కు పోయిన ముఖం...దరిద్రుల ప్రతినిధి.

'మా బాబే! మా బాబే! పద...పద...' అంటూ కుర్రవాడి చెయ్యి ఆసరాగా పట్టుకుని ఒక్కొక్క మెట్టు దిగింది.

'ఆ సంచి నాకివ్వు అవ్వా!...నేను పట్టుకుంటాను...' భాగ్యమ్మ కొంచెం సందేహించింది.

'పట్టుకు పారిపోనవ్వా! నేనలాంటి వాణ్ని కాను...' భాగ్యమ్మ తన సందేహానికి సిగ్గుపడింది. వెంటనే సంచి వాడి చేతిలో పెట్టింది.

భాగ్యమ్మ మెట్లన్నీ దిగి ప్లాటుఫారం మీదకు చేరుకుంది.

'ఇహ చాల్లే బాబూ! నేను వెళ్ళగలను' అంటూ భాగ్యమ్మ కుర్రవాడి చేతినుండి సంచి తీసుకుంది.

'హౌరా నుండి మద్రాసు వెళ్ళే మెయిలు ఒకటవ నెంబరు ప్లాటుఫారము నుండి పది నిముషములలో బయలుదేరడానికి సిద్ధముగా వున్నది...' మైక్రోఫోను మ్రోగుతోంది.

భాగ్యమ్మకు ఎన్నడూ లేని బలం వచ్చింది. ఇప్పుడు తేలిగ్గా నడవగల్గుతోంది.

పది నిముషాల్లో ఎక్కడని వెదకడం? మైలు పొడవు వున్నట్లుగా వుంది మెయిలు. ఫస్టుక్లాసు కంపార్ట్మెంటు దగ్గర చూసుకుంటూ వెడుతోంది.

ఒకటి... రెండు... మూడు... నాలుగు పెట్టెలు. మనవడు కనిపించలేదు. ఇంకా ముందుకు నడిచింది.

ఎయిర్ కండిషన్డ్ కంపార్ట్మెంటు ముందొక చిన్న గుంపు. కంపార్టుమెంటు ద్వారంలో దొరలాంటి ఒక యువకుడు నిలబడి వున్నాడు. మెడనిండా పూలదండలు. చిరునవ్వుతో అందర్నీ పలుకరిస్తున్నాడు.

మనవడే. సందేహం లేదు.

'ఎంత మారిపోయాడు? ఎంత దర్జా? సూటులో అచ్చు దొరలాగున్నాడు' అనుకుంది భాగ్యమ్మ.

భాగ్యమ్మకు గట్టిగా పిలవాలనిపించింది. ఆనందంలో నోరు పెగిలిరాలేదు. జనంలో నుండి తోసుకుని ముందుకు వెళ్ళడానికి ప్రయత్నించింది. లాభం లేకపోయింది. విజయవాడ ప్రముఖ డాక్టర్లంతా వున్నారు. ఒకరిద్దరు భాగ్యమ్మకు కూడా తెలుసు.

వీళ్ళంతా తన మనవణ్ని చూడ్డానికొచ్చిన వాళ్ళన్నమాట? భాగ్యమ్మ మనవడు దండల్లో మునిగిపోయాడు.

'పాడుదండలు. తృప్తిగా చూసుకోనివ్వకుండా ఏమిటిదంతా? భాగ్యమ్మ విసుక్కుంది.

డాక్టర్లు ఏవేవో ప్రశ్నలు వేస్తున్నారు. మనవడు నవ్వుతూ సమాధానాలిస్తున్నాడు. పత్రికలవాళ్ళు గాబోలు ఫోటోలు తీసుకుంటున్నారు.

భాగ్యమ్మకు మనవణ్ని కలుసుకునే దారి కనబడ్డం లేదు.

'బాబూ!...' అరిచింది. ఆ గోలలో వినిపించదు.

'బాబూ! నేను ఇక్కడున్నాన్రా...'

గట్టిగా అరిచింది.

ఎవ్వరూ వినిపించుకోలేదు.

మనవడి ప్రక్కనే ఒకామె నిలబడి వుంది. అందంగా చందమామలా వుంది. మనుమరాలు. సందేహంలేదు. ఆమె తన వంక చూసింది. వెంటనే దిగి జనంలో నుండి దూసుకొచ్చి భాగ్యమ్మ చెయ్యి పట్టుకుంది.

'అవ్వా! నువ్విక్కడున్నావా? రా... రా... నీ మనవడి దగ్గరకు తీసుకెడతాను' అంటూ లాక్కుపోబోయింది.

'తప్పుకోండి...ప్లీజ్...'

గంట మ్రోగింది. గార్డు విజిల్ వేశాడు. పచ్చదీపం చూపుతున్నాడు.

'శాంతా! రా...క్విక్...' మనవడు భార్యని పిలిచాడు. శాంత భాగ్యమ్మ చెయ్యి విదిలించుకుని పరుగెత్తింది. మెయిలు కూత వేసి కదిలింది.

'బై...బై...'

'చీరియో...'

'గుడ్‌లక్...'

డాక్టర్లు వ్యాఖ్యానాలు చేసుకుంటూ తిరుగుముఖం పట్టారు.

'జీనియస్...'

'ఔట్ స్టాండింగ్...'

'వండర్‌ఫుల్ ఎఫర్ట్.'

వెళ్ళిపోయిన రైలు వైపే చూస్తూ నిలబడిపోయింది భాగ్యమ్మ. నవ్వాలో ఏడవాలో అర్థంకాని అయోమయ స్థితిలో పడింది. మనవడి గొప్పతనం చూసి సంతోషించాలా? లేక అన్యాయంగా రెండు మాటలు మాట్లాడలేకపోయిన పరిస్థితికి దుఃఖించాలా? ఏదీ తోచక వెనక్కి తిరిగింది. కాళ్ళీడ్చుకుంటూ ఓవర్‌బ్రిడ్జి మెట్ల దగ్గర కొచ్చింది.

'అవ్వా! మెయిల్లో వెళ్ళలేదూ?' మళ్ళీ ఆ కుర్రాడు ముఖం వాడిపోయి దీనంగా కనిపించింది. భాగ్యమ్మకు జాలివేసింది.

'ఇలా రా బాబూ!' ఎక్కబోతున్న మెట్లు దిగి ప్రక్కకు నడిచింది.

'అన్నం తిన్నావా?'

'లేదు.'

'ఆ కొళాయి దగ్గరకు పద. నేను పెడతాను.'

ప్లాటుఫారం బెంచీమీద కూర్చుని కేరేజి విప్పింది. మనవడికోసం ప్రేమతో తెచ్చిన గారెలూ, అల్లంపచ్చడీ... 'ఇదిగో తిను...' అని కుర్రవాడిముందు పెట్టింది. ఆశించని ఆప్యాయతకు ఆ కుర్రవాడు తట్టుకోలేక తబ్బిబ్బయిపోయాడు. వాడు గారెలు తింటోంటే ఖాళీ గిన్నెతో మంచి నీళ్ళు తెచ్చి ముందుంచింది.

'అమ్మా నాన్నా వున్నారా?'

'లేరు.'

'ఏమయిపోయారు?'

'తెలియదు.'

భాగ్యమ్మకు తను బ్రతికి వుండటంలో అర్థమూ ప్రయోజనమూ కనిపించింది. ఇన్నాళ్ళూ తనని ఎవరూ ఆదరించడం లేదని బాధపడింది. తనతో ఎవరికీ అవసరం లేక తన బ్రతుకు నిష్ప్రయోజనం అనిపించింది. తనతో అవసరం వున్నవాళ్ళు బోలెడుమంది వున్నారు. తనవాళ్ళ ఆవేశ సంకుచితత్వం వదిలి కొంచెం విశాలంగా ఆలోచిస్తే తన బ్రతుకు నిష్ప్రయోజనం కాదు. తనకు ప్రస్తుతం కావలసిందల్లా కొంచెం ధైర్యం. తెగువ. ఇప్పటికీ తన పేరున అయిదెకరాల మాగాణి వుంది. తన ఇష్టమొచ్చినట్లు ఖర్చు పెట్టుకున్నా కొడుకూ కోడలూ అడ్డుచెప్పరు. అయినా ఈ వయసులో ఈ విపరీతం ఏమిటని ముక్కుమీద వేలేసుకుంటే వేసుకుంటారు. మంచిదనిపించింది చేస్తే ఎవరేమనుకున్నా ఫరవాలేదు.

'ఈ పసివాణ్ణి పెంచి, చదువు సంధ్యా చెప్పించి పెద్దవాణ్ణి చేస్తే?' తన బ్రతుక్కి అర్థం వుంటుంది. పరమార్థం వుంటుంది.

'అవ్వా! ఇహ తినలేను...'

'ఇష్టం లేకపోతే వదిలెయ్యి బాబూ! మిగతావి ఏ అడుక్కునేవాళ్ళకో యిచ్చి కేరేజి కడుక్కురా...'

నిముషంలో కేరేజి కడుక్కుని తీసుకొచ్చాడు.

'నన్ను మెట్లెక్కిస్తావా?'

'ఓ.'

'పద...' ఇద్దరూ ఓవర్‌బ్రిడ్జి మెట్లెక్కారు. భాగ్యమ్మకు నీరసం ముంచుకు రాలేదు. దడలేదు. ఆయాసంలేదు. అతి తేలిగ్గా మెట్లెక్కగలిగింది.

'నాతో వస్తావా?'

'ఎక్కడికి?'

'మనింటికి' ఆ కుర్రవాడికి పూర్తిగా అర్థం కాలేదు. ఇద్దరూ మౌనంగా నడిచారు. ఓవర్‌బ్రిడ్జి దాటి మెట్లు దిగారు.

'అమ్మా! రిక్షా...'

'సూర్యారావు పేటొస్తావా?'

'రండమ్మా! రండి.'

'ఎంత?'

'ముప్పావలా.'

'పద' ఇద్దరూ రిక్షా ఎక్కి కూర్చున్నారు. వాతావరణం చలిగా వుంది. అయినా భాగ్యమ్మకు ఆ కుర్రవాడి స్పర్శ వెచ్చగా హాయిగా వుంది.





జరిగిన కథ

అప్పుడే బియ్యే పరీక్షలు రాసిన కృష్ణవేణి తాతయ్య శాస్త్రిగారి పెళ్ళి గ్రామం చూచి బయలుదేరి వస్తుంది. రాజశేఖరంతో పెండ్లి చూపులు, తర్వాత వివాహం జరుగుతుంది. రాజశేఖరం చెల్లెలు మీనాక్షి మహా మూఢాచార పరాయణులు అయిన అత్తమామల ఆరళ్లు పడలేకపోతుంటుంది. భర్త శంకరం ఆమె కన్నీరు చూడలేని పిరికివాడు. తప్పించుకుని వచ్చిన ఒక స్త్రీకి మధు తన గదిలో ఆశ్రయమిస్తాడు. ఆమె రాణి అనే ఒక వేశ్య. రాణి ఎక్కడికో వెళ్లింది. ఆమె ఎడబాటుని సహించలేకపోయాడు మధు. బుద్ధిమంతుడైన రాజశేఖరానికి రంగనాథం మొదట సిగరెట్టు కాల్చడం నేర్పాడు.

6

'ఏం బ్రదర్, అలా వున్నావు?' అంటూ ప్రవేశించాడు కిరీటి.

మధు తలెత్తి చూసి 'ఎలా వున్నాను?' అన్నాడు.

'ఎలా ఉన్నావో నీకు తెలియదా? ఒక్కసారి అద్దంలో చూసుకో. ఎంత డల్‌గా వున్నావు?' షేవ్ చేసుకుని ఎన్నాళ్ళయింది? తలకి నూనె రాచి దువ్వి ఎన్నాళ్ళయింది? ముఖంలో కళ ఏమైనా ఉందా? జబ్బు పడిన వాడిలా వున్నావు? కుంపటిలో అగ్నిలా నీలో నువ్వు ఆలోచించుకుని ఎందుకలా దహించుకుపోతావు? నువ్వు కాలేజీకి వచ్చి ఎన్నాళ్ళయిందో తెలుసా? అసలేమిటి నీ బాధ?'

'ఏం బాధ లేదు.'

'అదోలా నవ్వుతావు ... నీకు అబద్ధాలాడటం చేతకాదు. నీ బాధేమిటో నాకు తెలియదు. కాని నీకు ఈ జీవితమంత ఆరోగ్యకరమైనది కాదు.'

మధు జాలిగా నవ్వాడు.

'నిజం బ్రదర్ బాధ తగ్గాలంటే దాన్ని అర్థం చేసుకునే వ్యక్తి పక్కనుండాలి. నీ కథేమిటో చెప్పు.'

'ఏంలేదు వంట్లో సరిగా లేదు.'

'కనిపిస్తూనే వుంది!'

మధు మాట్లాడలేదు. విసుగ్గా చూశాడు.

'సిగరెట్ తాగుతావా!' అన్నాడు కిరీటి తను వెలిగించి.

మధు వద్దన్నట్లు తలవూపాడు.

'నాకు తెలుసు. నువ్వు తాగవు. చాదస్తుడివి. ఈరోజుల్లో అవన్నీ ఏమిటోయ్!' మధు మాట్లాడలేదు. భారంగా కళ్ళు మూసుకొన్నాడు.

'చూడు మధు. జీవితం పరిమితమైంది. పొద్దాకులు మడికట్టుకు కూర్చుంటానంటే కుదరదు. నిన్ను నీవు వంచన చేసుకోటమే మిగులుతుంది. నీలో సంఘర్షణ జరుగుతున్నది. నీ హృదయంలో భావాలు యుద్ధం చేసుకుంటున్నాయి కాని దానికి కారణమేమిటో నాకు తెలియదు. మనిషి తననుగురించి బాధలోనే ఆలోచిస్తాడు. తన ఉనికిని బాగా గుర్తిస్తాడు. లే బ్రదర్ రా పోదాం.'

'సారీ కిరీటి, నువ్వెళ్ళు. నా కెక్కడికి రావాలని లేదు.'

కిరీటి అతని పక్కన వచ్చి కూర్చున్నాడు.

'ఒక విషయం అడుగుతాను. నిజం చెబుతావా?' అన్నాడు.

మధు భావాలు మండుతున్నాయి.

అతనికి ఏకాంతంగా వుంటే బాగుండునని వుంది. కిరీటి వదలడే! పోనీ రాణి సంగతి చెబుదామంటే ఎలా చెప్పటం ఇతనితో?

'ఏమిటి?' అన్నాడు మధు.

'నువ్వెరినైనా ప్రేమించావా?'

'చాలా చిక్కు ప్రశ్న.'

'కాని చాలా ప్రయోజకరమైన ప్రశ్న.'

'జవాబు నా దగ్గరలేదు.'

'నా దగ్గరుంది.'

'అయితే నన్నెందుకు అడగటం?'

'నువ్వెరినో ప్రేమిస్తున్నావని గట్టిగా చెప్పగలను. నాకు తెలీనిదల్లా ఆమె ఎవరనే! ఒక స్త్రీని గురించి ఆలోచిస్తున్నావంటే నీ ఆత్మను ఆమెకిచ్చేసినట్టే. నీమీద ఇంత ప్రభావం చూపిన ఆమె ఎవరో తెలుసుకోవాలని వుంది మై డియర్ మధు, చెప్పు. ఎవరా అమ్మాయి?' మధు విసుగ్గా చూశాడు.

'నీదంతా ఊహ.'

'సత్యం ఆలస్యంగా తెలిసినా ప్రయోజనం వుండదు. చేతులు కాల్చుకోవటమే అవుతుంది.'

'నన్ను వదిలెయ్. నాకేం సమస్యలు లేవు.' కిరీటి సిగరెట్ ఆఖరి పీల్చు పీల్చి పారేశాడు.

'మధు, నేను నిన్ను చాలరోజులు స్టడీ చేశాను, నిన్ను గురించి నీకు తెలిసింది చాల తక్కువ. నీకసలు జీవితమంటేనే ఏమిటో తెలియదని అనుకొన్నాను. నిన్ను చూసి మొదట్లో నవ్వుకున్నాను. నీకు భయం ఎక్కువ. నీ నీడని చూసి నువ్వే బెదురుతావు. ఎప్పుడూ జీవితపు మూలల్లో కూర్చుని కాలం గడిపేస్తావు. ప్రతి దానికి ఇతరుల మీద ఆధారపడతావు. నీ అవసరాలేమిటో నీకు తెలియదు. అందుచేత జీవితం నిన్ను ఫోటోని ఫ్రేంలో బిగించినట్టు బిగించింది. నీకు పోరాడటం లేదు. ప్రతి దాన్ని గోరంతలు కొండంతలు చేసుకుని బాధపడటం నీ అలవాటు. అంతేగాని నివారణోపాయం కనుక్కోవు. ఇలాంటి

అమాయకుడివి నువ్వు. కానీ నీకు హృదయం వుంది. అది స్పందిస్తుంది. బాధలో నీకు కన్నీరు వస్తుంది. నీ కన్నీరు నితరులు పంచుకోవాలని నీ మనస్సు ఆరాటపడుతుంది. చిక్కల్లా ఏమిటంటే ఆ కన్నీరు నెవరికీ చూపవు. నీకు సానుభూతి కావాలి కాని దాన్ని పొందేందుకు ఏలాంటి ప్రయత్నము చేయవు. సానుభూతి లేందే, బాధ దహిస్తుందే కాని చల్లారదు. తీరుతుంటే కోరికలు పెంచుకో. తీరవని తెలిసి వస్తును ధైర్యంగా శస్త్రచికిత్స చేసి పారెయ్యి. అప్పుడే ఆనందంగా జీవించగలవు.' మధు నిట్టూర్చాడు.

'నిజం కిరీటి. నాకేమిలేదు. నేను బాగానే వున్నాను.' అన్నాడు తల వంచుకుని.

కిరీటి ఒక్కనిముషం మధుని పరీక్షగా చూశాడు.

తరువాత జేబులోని సిగరెట్‌తీసి వెలిగించాడు.

'సరే రా పోదాం.' అన్నాడు.

'ఎక్కడికి'

'సినిమాకి'

'ఇప్పుడేం పోతాం?'

'ఇంకా టైముంది?'

'రావాలిసిందేనా?'

'రమ్మంటున్నాను? ఈగది నాలుగ్గోడల మధ్య కూర్చుంటే జ్ఞాపకాలు మరీ బాధ పెడతాయి. నిన్ను వేద తీర్చేది ప్రకృతే.' మధు నీరసంగా గోడనానుకున్నాడు.

'నాకెక్కడికీ రావాలని లేదోయ్' అన్నాడు.

'మనం చాలాపనులు ఇచ్ఛతో చేయం. కొన్ని యాంత్రికంగా జరిగిపోతాయి. నువ్వు చేసే ప్రతిపనికి ప్రయోజనం వుండాలంటే వుండదు. నాదృష్టిలో ఇబ్బున్నా లేనట్టు నటించటం ఉత్తమం.' అన్నాడు షేవింగ్‌సెట్ ముందుపెట్టి.

మధు అద్దంలో ముఖం చూసుకుని వణికిపోయాడు.

'ఊ! షేవ్‌చెయ్యి'

'సాయంకాలం చేసే అలవాటు లేదు కిరీటీ.'

'అదే చాదస్త మంటున్నాను.'

మధు మాట్లాడలేదు. పది నిమిషాల్లో షేవ్ చేసుకున్నాడు.

కిరీటి లేచివెళ్ళి నూనెసీసా తెచ్చి, ఇంత నూనె చేతిలోవేసి రాసుకో అన్నాడు

మధుకి తప్పలేదు.

'ముఖం కడుక్కో పోదాం.'

మధు వెళ్ళి పదినిముషాలలో స్నానంచేసి వచ్చాడు.

'గుడ్, డ్రెస్ చేసుకో పోదాం.'

'పద.'

స్నానంచేశాక అతని ప్రాణానికి హాయి అనిపించింది. అతని మనస్సు తేలికపడింది.

'కాఫీ తాగిపోదాం.'

మధు మౌనంగా కిరీటి ననుసరించాడు.

ఇద్దరు హోటల్‌కు వెళ్ళి కాఫీలు తాగి బయటకు వచ్చారు.

మధు రిస్టువాచి చూసుకున్నాడు.

'పిక్చర్ మొదలుపెట్టి వుంటారు' అన్నాడు.

'పరవాలేదు రా పోదాం. అలా తిరిగి వద్దాం.' అన్నాడు కిరీటి నవ్వుతూ. ఇద్దరు నడక సాగించారు.

మధుకి కిరీటి ననుసరించటం తప్ప ఏమీ తెలియలేదు. దారిలో ఇద్దరూ మాట్లా



కోలేదు. కొన్నినిముషాలు నడిచాక మధు ఆగి, 'మనం ఎటు పోతున్నాం కిరీటి? దారి తప్పి వచ్చామా ?' అన్నాడు.

'లేదు. దారితెలిసే వచ్చాం.'

'వద్దు వెళ్ళిపోదాం. ఈ ప్రాంతం అంతా చీకటిలో ఏమిటోగా వుంది.'

'చీకటైతేనేం, గుడిసెల్లో దీపాలున్నాయి.'

'అవి మనకేం వెలుగునిస్తాయి? ఆ వెలుగు గుడిసెలోపలే వుంటుంది.'

కిరీటి మధు చెయ్యి పట్టుకున్నాడు.

'నీకేం భయంలేదు. నేనున్నాను.' అన్నాడు కిరీటి.

'భయమేముంది ?' అన్నాడు మధు.

కిరీటి వెళ్ళి ఒక కాంపౌండుముందు ఆగాడు.

దానిలోపల పదిపదిహేను గుడిసెలున్నాయి.

'ఏమిటి కిరీటి ఇక్కడెందుకు?' అన్నాడు. అతని హృదయంలో ఎన్నో ప్రశ్నలు. అతని జీవితమే ఒక జవాబు రాని ప్రశ్న అయింది. ఆ ప్రదేశంలో నిల్చోటమే అతని ఇష్టంలేదు. ఆ ప్రాంతమంతా ప్రపంచంలోని అవినీతి దూడుకట్టుకున్నట్టు చీకట్లో వుంది. అయితే వీధిదీపాలు అక్కడక్కడ వెలుగునిస్తున్నాయి. ఆ దీపాల వెలుగులో కొచ్చి వాలిగా పళ్ళని చూపి నవ్వుతూ, తమ సౌందర్యాన్ని చూపుతున్నారు కొందరు స్త్రీలు, మధు వారిని సూటిగా చూడలేక పోతున్నాడు కాని వాళ్ళు నిర్భయంగా అతన్ని చూస్తున్నారు. అయితే కిరీటి ఏమీ పట్టలేదు. అతను వాళ్ళు నవ్వినవ్వుల నవ్వుతున్నాడు. ద్వంద్వార్థాలు వచ్చే సినిమాపాటలు పాడుతున్నాడు వాళ్ళని చూసి.

'కిరీటి' అన్నాడు తీవ్రంగా మధు.

అతని మనస్సు పెనగాలికి లతలా వూగి పోతున్నది.

కిరీటి అతని మాట వినిపించుకోలేదు. పాడుతున్న సినిమా పాట ఆపి 'వెంకమ్మా' అని పిలిచాడు.

ఆ జవాబుకు ప్రత్యుత్తరం లేదు. కాని అతని గలిదు స్వరం రేగింది.

ఛ ... ఎవడే వాడు.'

... ఒక స్త్రీని జుట్టు పట్టుకుని ... లాక్కొచ్చాడు ఒకతను.

వాడిని చూస్తేనే భయంకరంగా వున్నాడు. ఆ చీకట్లో మింగుతున్న సన్న వెలుగులో వాడిముఖం భీకరబడ్డది. ఎర్రబడ్డ ఆ ముఖంమీద మచ్చలు, బుగ్గపైన పొడుగ్గా గాయపుగుర్తు, క్రౌర్యం మూసలోపోసి తయారుచేసిన విగ్రహం, మానవత్వం పూర్తిగా నశించిపోయిన హృదయం—అతని కళ్ళు భీకరబడినయి. తాగివున్నట్టు స్పష్టంగా తెలుస్తూనే వుంది. మధ్యమధ్య. అతను వేసే కేకలకు గొంతుకు కట్టిన గళ్ళలుంగి వూడిపోతున్నది. వూడుతున్న లుంగీని ఒకచేత్తో పట్టుకుని మరోచేత్తో దాన్ని కొడుతున్నాడు. వాడి నోట్లోంచి మాటకూడ స్పష్టంగా రావటం లేదు.

'వాడెవడ్రా నచ్చినోడా ?' అంది దెబ్బలు తింటూ ఏడుస్తూ.

'దొంగముండా, అబద్ధాలాడేవంటే డొక్క చించుతా. నా కళ్ళలో కారం కొడ్తావంటే. నీ బతుకేం బతుకే కుక్క బతుకు వన్ను కాపి పరుగెత్తేందు. దొరికుంటే ఆడనే పాతి పెట్టేవోడ్ని. ఆడితో కులుకు తావే దొంగ నచ్చిందానా ? అంతిచ్చిండు వాడు.'

మరి రెండు తగలనిచ్చాడు.

అది ఏడుపు లంకించుకుంది.

## వలపు పిలుపు

మధురాగ సరళిలో
మృదు వేణు పరిధిలో
నీ మురళి రవళికి
మైమరచి హృదివీణ ప్రమోగించి పాడేను
స్వామీ —మధు||
వలపులే చిలికేవు— మమతలే పూయించి
మనసునే దోచేవు— చిరునవ్వు వెలయించి
—మధు||
నీ రూపు మది రేపు తీయనీ కోరికా
నీ వేణు సుధ తీపి మధు వాన కురిసేను
—మధు||
నీ రాధ పాడేను మనసంత నీవు నిండ
నీ రాధ వేచేను కనులలో వలపు దీపాలు
వెలిగించి.—మధు||

—రఘు & రూప

వాళ్ళమీట్నా వేదిమీంది పోగయినారు.

కాని ఎవళ్ళూ వాళ్ళని విడదీయ అని ప్రయత్నించలేదు.

వాడి మనస్సు పూర్తిగా మత్తెక్కి పోయింది. దాని మొగంమీద కొట్టటం మొదలుపెట్టాడు.

అది దెబ్బలు తప్పించుకుంటూనే వాడిని నానా బూతులు తిట్టటం మొదలుపెట్టింది.

'నా సయితి ఏమన్నా పెట్టిందా ఎదవ దువ్వపోతా!'

వాడు చురచుర దాన్ని చూశాడు.

'పాల్నా తిన్న దెబ్బలు.' అన్నాడు విజయగర్వంతో. మధు కక్కడ వుండటం అసహ్యమేసింది. ఎవరన్నా చూస్తే తనగతేంకాను?

ఇంతలో ఒకామె ముందుకువచ్చి వాడిని ఇవతలికి లాగింది.

'ఏందిరా ఇది? ఎదవ—'

'ఏంవా ? ఈ ముండ వాడినో తెచ్చింది. ఆడితో కులుకుతూ వుంది. కళ్ళారా చూసినా—'

'పోరా ఎదవ. తాగి వచ్చినావు. ఏటో వాగుతున్నావు. పోయి ఏడన్నా పడుకో. కొంపకి పో.'

'పో. పో, కొంపకి పో. పెళ్ళాం వుందిగా. నీకు నాకు ఏటి ?' అంది అది. సగం ఏడుపు సగం కోపం కలిసిన గొంతుతో.

'ఛస్, నా పెళ్ళాం సంగతి నీకెందుకే ముండా. నే పోను. దాని మొగం సూడను.'

'నువ్వు లోపలికి పోవే' అంది ఆమె.

అది వాడిని నానా తిట్లూ తిడుతూ లోపలికి పోయింది. దాని వెక్కిళ్ళు విని పిస్తూనే వున్నాయి. కాని గాలిసంగతి ఎవరూ పట్టించుకోలేదు.

'మనం ఇక్కడ ఉండకూడదు. రా పోదాం.' అన్నాడు మధు.

అతని కళ్ళకి ఇదో క్రొత్త దృశ్యం.

కిరీటి మధువంక చూసి చిన్నగా నవ్వి భయపడ్డావా? ఏం లేదు' దాన్ని ... ంచు ... న్నాడు. వాడెక్కడో కలప అడితిలో పని చేసి ... రెండో మూడో తెస్తాడు. అందులో సగం తాగుడికి పోతుంది. ... అరో ... రూపాయో దీనికిస్తాడు. ... డికీ ... లోనే ... పెళ్ళాం వుంది. ... గుంపులో వెలుగులో పిల్లలు. నీను వాళ్ళను ఖాతా చూడను. ఇది వాడిదగ్గర డబ్బు గుంజుతుంది. వాడు లేనప్పుడు ఇతరుల దగ్గర

గుంటతుంది. వాడొచ్చి చూస్తే ఇలాగే అవుతుంది. వాళ్ళకి మామూలే' అన్నాడు.

'నువ్విక్కడకు తీసుకొస్తావని తెలిస్తే నేను వచ్చేవాణ్ణి కాదు కిరీటి. నేను పోతాను' అన్నాడు.

కిరీటి అతని చెయ్యిపట్టుకుని ఆపాడు.

'ఆ విషయం నాకు తెలుసు మధు. అందుకే నీకు ముందు చెప్పలేదు. మనసు లకు జబ్బు చేస్తే ఇదే మంచి మందు. ఆనందం అవినీతిలో వుందో. నీతిలోవుందో నీకనవసరం. నీవనల్లా అనుభవించటమే.'

మధు మనస్సులో వేయి దపు కెరటాలు విరుచుకుపడుతున్నాయి. ఇదే చీకట్లో ఒక రాత్రి లాంటివాడ్నే చూశాడు. ఈరోజు వీళ్ళి చూస్తుంటే 'రేపు రాణి గతి ఇంతే నేమో?' అనిపించింది. ఈ భావం మనసుకు విద్యుద్ఘాతంలా తగిలింది. అతని మేను బలహీనతతో బాధపడింది. అతని నరాలు వణికిపోయినవి. అతను విల్చోలేక పోయాడు.

'వెంకమ్మా' కిరీటి పిల్చాడు.

వెంకమ్మ కిరీటిని చూసింది. ఆమె ముఖం వికసించింది.

'మీరా? దండాలు బాబు.' అని మధు వంకచూసి 'ఎవరీన?' అంది.

'బంగారప్పిచ్చుక. పిల్ల జమీందారు.' వెంకమ్మ తములపాకులు వేసుకోటంవల్ల గారపట్టిన పళ్ళను బయటపెట్టి నవ్వింది పొగాకు కంపు గుప్పున కొట్టింది.

'మీ స్వర్గంలో విహరించాలని వచ్చాడు. తాజా సరుకు చూపించు. ధర ఎక్కువైనా

# అమృత కలశం

ఫరవాలేదు నేనిచ్చుకుంటాను.'

'ఓ ఒకటో నెంబరు సరుకుంది, కొత్తేమొ?'

'నీ దగ్గర కొత్తేమిటి? నీ శృంగార దేవతలు మాయలు తెలిసినవాళ్ళు. ఋషులు సహితం చలించి పోవలిసిందే.'

వెంకమ్మ నవ్వింది.

'ఇంద' అన్నాడు కిరీటి పరవయి రూపాయలు తీసి ఇస్తూ.

'దాని చేతిలో కాస్త పెట్టమనండి' అంది వెంకమ్మ.

కిరీటి నవ్వి తలూపాడు.

మధుకి తల తిరిగిపోతున్నది: తను భ్రష్టుడై పోతున్నాడు.

'వద్దు కిరీటి; నాకు ఆత్మవుంది. నాది నిర్మలమైన మనస్సు. నా ఆత్మని చంపుకో లేను. నేను గాలేను. నువ్వన్నట్లు ఇది నా బలహీనతే అయినా దీన్ని నేను గౌర విస్తాను' అన్నాడు. కిరీటి అతని బుజం మీద చెయ్యివేసి ఆపాడు.

'పిచ్చివాడివి నువ్వు. అవకాశాలు నీకోసరం కాచుకు కూర్చోవు. నువ్వే కల్పించుకోవాలి. మనిషి కేవలం అన్నం తినే బ్రతకలేడు. అతనికి కావలసినవి మరి కొన్ని ప్రకృతిలో వున్నాయి. వాటిని నువ్వు గుర్తించటం లేదు. నేను గ్రహించాను. అందుకే ఇక్కడకు తీసుకొచ్చాను. నీకు ఆత్మవుందన్నావు. కాని అది ఆకలితో మాడిపోతున్నదని నీకు తెలీదు అందుకే నీకు తృప్తి గలటం లేదు. సుఖానుభూతి నీ అనుభవంలోకి రాలేదు. బ్రతకటం నేర్చుకో. వెళ్ళు నువ్వు చదువు కోటంలోనే విద్యార్థివి.'

మధు కిరీటి చెప్పింది సగం వరకే విన్నాడు, అతని చూపులు చీకటిని చీల్చు కుని పోయినవి. గుడిసెలోపల లాంతరు వెలుగులో ఒకామె శరీరం ఎర్రగా మండి పోతూ కనిపించింది. అతని ఆత్మకళ్ళోకి వచ్చి ఆర్తంగా చూసింది ఆమే! రాణి, అతని మనస్సుకు బాణం తగిలినట్లైంది. అతను అప్రయత్నంగా అటువైపు వడక సాగించాడు.

కిరీటి మధువంక చూసి విరగబడి నవ్వి, 'విశ్వామిత్రుడు కూడ మొదట్లో ఇలాగే అన్నాడు. ఆయనకంటే గొప్పవాడివా నువ్వు.' అన్నాడు.

'రాబావా.' అంటూ మరో స్త్రీ అతన్ని తీసుకు పోయింది.

మధు లోపలికి వెళ్ళి తడిక తలుపు దగ్గరగా వేశాడు.

తలుపు మూసిన చప్పుడు విని రాణి త్రుళ్ళిపడి లేచి కూర్చుంది. ఆమెకి మధు కనిపించాడు.

రాణి హృదయం ఏదో అస్పష్టమైన కేక వేసింది.

కాని మధుకి అది వినపడలేదు.

ఆమె తన కళ్ళని తనే నమ్మలేక పోయింది.

ఇతను ఇక్కడి కెందుకు వచ్చాడు?

'రాణి' అన్నాడు కంపిస్తున్న గొంతుతో:

ఆ రెండు అక్షరాల పిలుపుతోపాటు. ఆనందము విషాదము హృదయంలోంచి ముక్కలుముక్కలై బయటపడింది. రాణి అతన్ని చలిస్తున్న చూపులతో చూసింది. ఆమె రక్తనాళాల్లోంచి రక్తం బరువుగా ప్రవహించింది. హృదయం దడదడ లాడింది. ఆమె మనస్సులో గతము భవి ష్యత్తు ముళ్ళు వేసుకున్నాయి. చపలత భావాల బరువువేత తల వాలిపోయింది. శరీరమంతా వెచ్చని ఆవిరతో నిండి పోయింది.

'రాణి' అన్నాడు సమీపానికి పోయి.

విందుకో అతని గొంతు గద్గదికమైంది. రాణిమీద ఎన్నో రోజాలనుంచి పేరుకు



పోయిన ఆత్మీయుడు ఆమె ఎదుటకు వచ్చింది.

రాణికి మాట రాలేదు. ఆమె మనస్సులో తన భ్రష్ట జీవితమంతా నెమరు వేస్తున్నది. ఆమె కళ్ళలో నీరు గూడు కట్టుకుని రాలి పోతున్నది. దురదృష్ట వశాత్తు ఆ అశ్రువులకి స్వరంలేదు. ఇది రూపంలేని భావన. ఆమె కెందుకో శూన్యం లోకి పోయి వెక్కి వెక్కి ఏడవాలని వుంది. ఆమె కళ్ళకి ప్రపంచమే తల్లక్రిందు లైనట్లుగా వుంది

'బాగున్నావా రాణి ?' అన్నాడు శోక దేవతలా వున్న ఆమెను చూసి.

అతని మనస్సు భరించలేని ఆత్మీయుతతో నిలవిల్లాడి పోయింది.

ఆ ఇద్దరిమధ్యా మౌనం పేరుకుపోతున్నది. ఆ మౌనం ఇద్దరి హృదయాలను దగ్గరి లాగుతున్నది. ఆ నిశ్శబ్దపు కాలబిందువులు లాంతరు వెలుగులో బంగారు రంగుతో మెరిసి కరిగిపోతున్నాయి. అది మమతో ప్రేమో, ఆనందమో, సానుభూతో, దుఃఖమో, విషాదమో ఇవన్నీ మిళితమైన మనోభావమో అతని అహాన్ని ఆక్రమించింది. పుట్టినప్పటినుంచి ఈ అహం ఆమె ముట్టూ తిరుగుతున్నదేమో?

మధు ఆమెని అదోవిధమైన తృష్ణతో చూశాడు. ఆమె తలలో మల్లెపూలు స్వచ్ఛంగా నవ్వుతున్నాయి. తనలోని నిర్మలత్వాన్ని బయటకు చెప్పటానికా అన్నట్టు తెల చీర కట్టుకుంది. అతను ముగ్ధుడై ఆమె సౌందర్యాన్ని ఆవలోకించ సాగాడు.

ఆమె పెదవులు కంపిస్తున్నాయి.

మధు కళ్ళు మూసుకున్నాడు.

అతనిలో ఆత్మవిమర్శ జరిగింది.

ఒక అదృశ్య కళాకారుడు కాలమనే దారంతో తమ ఇద్దరి జీవితాలను కలిపి కుట్టేస్తున్నట్టే అనిపించింది.

అతను ధైర్యంగా ఆమెని సమీపించి భుజంమీద చెయ్యివేశాడు.

ఆమెకు భుజంమీద అగ్నివర్షం కురిసింది. స్పృహ తప్పిపోతున్నట్టే అనిపించింది. ఆమె తన బాణాలాంటి చూపులతో అతన్ని చూసి కళ్ళు మూసుకుంది.

రోజూ తన జీవితాన్ని కొనటానికి ఎవరో వస్తారు. వదన ...కేం హక్కుంది?

'మాట్లాడవేం రాణీ?' అన్నాడు.

అతను తనలోని భావాన్ని పూర్తిగా వ్యక్తంచేయ లేక పోతున్నాడు.

అతనిలోని పురుషత్వం ఆమెలోని స్త్రీత్వం సంపూర్ణత్వాన్ని పొందాలని అభిలషిస్తున్నాయి. అయితే ప్రస్తుతం ఎవరివారు అంతరంగంలో ఏకాకి అయినారు అందుచేత సముద్రంపై అలలు సముద్రం లోకి ఎగిరిపడే విధంగా భావాలు ఎగిరి పడుతున్నాయి. వివిధభావాలు వాళ్ళని దహిస్తున్నాయి. ఈ ఏకత్వంకోసరం ఇద్దరి ఆత్మలూ ఆక్రోశించినాయి. కాని అతను ఆమెకి, ఆమె అతనికి ఒక విధంగా భయపడ్డారు. ఆమె కళ్ళలో కిరసనాయిలు దీపం నక్షత్రంలా మినుకు మినుకు మంది.

'మీరా బాబు, ఇక్కడికి వచ్చారేం?' అంది. మాటలు తడబడ్డాయి.

ఆమె కళ్ళలో ముత్యాల బిందువులు

నిలిచినాయి. క్రమంగా బుగ్గలపై నుంచి జారిపడినాయి.

'ఏడుస్తావెందుకు?' అన్నాడు.

'మీరు ఈ కూపంలోకి ఎందుకు వచ్చారు?'

'ఒక స్నేహితుడు తీసుకువచ్చాడు.'

ఆమె వెక్కివెక్కి ఏడ్చింది.

'మా బ్రతుకుల మీద మీకెంత జాలి?' అంది రెండరచేతులలో ముఖం దాచుకుని.

అతను జాలిగా చూశాడు.

'లేదు నేను వేరే ఉద్దేశ్యంతో రాలేదు. నమ్ము నన్ను.'

'కాదు నా జీవితంలోని లోపాలను, ఆ జీవితపు నిజస్వరూపాన్ని వేలెత్తి చూపాలని, హేళన చేయాలని ఇక్కడికి వచ్చారు. నాకు తెలుసు. మేడిపండలాంటి జీవితం నాది' అంది.

'నన్ను అలాగే అనుకుంటున్నావా రాణి?' అన్నాడు ఆవేదనగా.

'నువ్వే కనిపించకపోయితే ఈ జుగుప్సాకర వాతావరణం లోంచి పారిపోయి వుండేవాడిని. నువ్వు వెళ్ళిపోయిన రోజునుంచి ఏమైనావో నన్న దిగులే నాకు. నిన్ను చూడాలని వున్నా నీ అడ్రసు తెలీదు నాకు. నిన్ను చూసిన రోజు నుంచి నా జీవితంలో ఎంత విప్లవం సృష్టించబడిందో నీకు తెలియదు. నా జీవన కక్ష్యని నీకనుకూలంగా త్రిప్పుకున్నానో, నీ జీవన కక్ష్యని నా కనుకూలంగా త్రిప్పానో నాకు తెలియదు. నువ్వెళ్ళి పోయాక నాకు జీవితం అసంపూర్ణంగా కనిపించింది. ఏదో వెలితి. అసలు అనుభవించటానికి జీవితమే లేదని పించింది. నా వ్యక్తిత్వం నీ అనుభవాలతో తాదాత్మ్యం చెందింది. నా సత్యము, శివము, సుందరము—అన్నీ నువ్వే. నాకు శాంతి కావాలి. నువ్వులేకపోతే నేను బ్రతుకలేను రాణీ.' అన్నాడు ఆవేశంతో ఆమెను దగ్గరికి లాక్కుని.

'వద్దు బాబు, అలా మాట్లాడకండి. మురికి గుంటలోంచి మంచినీరు త్రాగలేరు బాబు'

'నీటిని ఇష్టం వచ్చినట్లు వదిలి పెడితే మురికి అవుతుంది.'

'మీ ముందు నేనెంత సిగ్గు పడుతున్నానో తెలుసా? మీ ముఖం చూడలేక చచ్చిపోవాలనివుంది; ఈ నికృష్టపు బ్రతుకులో వేదనలు పాముల్లా బుసలు కొడుతుంటే; సంఘం మమ్మల్ని పతితల్నిచేసి నవ్వుతుంటే, జీవించటం చేతకాక పువ్వుల్లాగా రాలి వాడిపోతున్నాము. నాకు సంఘంలో స్థానం లేదు. నా వ్యక్తిత్వాన్నెవరూ గౌరవించరు.' అంది ఏడుస్తూ.

'నా జీవితంలో వుంది. నా గృహద్వారానికి కట్టిన మామిడాకుల తోరణమే నీ జీవితం.'

'జాలి పడుతున్నారా?'

'నిజం చెబుతున్నాను. ఆత్మవంచన చేసుకోలేను, నా జీవితంలో హఠాత్తుగా వచ్చింది వెల్లువ. ఆదర్శాలు బ్రతుకుని ఎక్కడికో లాక్కుపోతయ్యంటారు నా స్నేహితులు. నన్నిక్కడికే లాక్కుని వచ్చినయి. జాలిలోంచి ఆవిర్భవించింది నా ప్రేమ. నా అన్వేషణకి ముగింపు నువ్వు. నాకు తోడునువ్వు, నా జీవితంలో సగం నువ్వు.'

రాణి హృదయం అస్సగించి వింటున్నది.

ఇది నిజమా? నిజానికి నీడా?

ఊహుఁ! ఇదెక్కడి సంభవం?

ఇది కేవలం కలతనిద్ర.

'మీరు ఆవేశంలో మాట్లాడుతున్నారు. నేను పక్కనుంటే నా కష్టాలు మీకు వస్తాయి. మీరెక్కడ నేనెక్కడ?'

'రాణీ.' అన్నాడు ఆవేదనగా.

'నేను మీదగ్గరుంటే మీరెన్నో త్యాగాలు చేయవలసి వస్తుంది. మీ జీవన దేవాలయంలో దేవుని విగ్రహమే వుండదు. మీవాళ్ళు నా ఉనికిని గుర్తించరు.'

'దేవుడు గుడిలో లేడు. దైవత్వాన్ని గుర్తించేందుకే గుడులు గోపురాలు. భగవంతుని స్వరూపం విశ్వవ్యాప్తమైంది రాణీ. దాన్ని ఒకళ్ళు గుర్తించనంత మాత్రాన విలువ తగ్గుతుందా? జ్యోతిని ఎవరూ చూడకపోతే దానికి కాంతి లేదటా? ఒకవేళ అలానే అయితే నీతోపాటు నా ఉనికిని పోగొట్టుకుంటాను.'

'మీరే మంటున్నారు?'

నమ్మలేక అంది.

'నా మతం మానవత్వం, నాకులం మంచితనం. ప్రేమించటం నా లక్ష్యం. బ్రతకటం బ్రతికించటం నా ధ్యేయం. ఇవి సాధించాలంటే నీ అవసరం ఎంతైనా వుంది.'

'మీ ప్రేమ ఆదర్శంతో ముడిబడింది.'

'ఏమన్నా అను. అది సంస్కారానికి మూలమైంది.'

'ఇది నరకం బాబూ. వెళ్ళిపొండి. మీ పవిత్రతను, మంచితనాన్ని కలుషితం చేసుకోకండి.'

'చెడుని కడిగినప్పుడే మంచి విలువ పెరుగుతుంది' అన్నాడు.

అతను ఆమెను పట్టుకుని తన వైపుకి త్రిప్పుకున్నాడు. దీపపు వెలుగులో ఆమె ముఖం చూస్తూ కన్నీరు తుడిచాడు.

'నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను రాణీ' అని ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె పెదవులు ఛగ్గుమన్నయి.

అతనిమీద వాలిపోయి మరోసారి ఏడ్చింది. అతనిలోని పవిత్రత తనలోని అపవిత్రతని నిలువునా దహించి వేస్తున్నట్లు అనుభూతి పొందింది.

(ఇంకా ఉంది)



**మేషం:** మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో వృత్తిలో ప్రయాస కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్య భారం పెరుగు తుంది. బంధువులకు సహాయం చేయగలరు.

**మిథునం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు. కొంటారు.

**కర్కాటకం:** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— అనవసరమైన వ్యయం జరుగు తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం.** ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేర గలదు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో శ్రమ అధికంగా ఉంటుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూలమైన మార్పులు వస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కన్య** వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగు తుంది. కోర్టు వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడ తాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**తుల** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. అనవసరమైన సందేహాలు కలుగు తాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుప గలరు.

# వారఫలం

**29 10 - 1971 శుక్రవారం మొదలు**

**4 - 11 - 1971 గురువారం వరకు**

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృశ్చికం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు.

స్త్రీలకు:— బంధు మిత్రులను కల్సుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**ధనుస్సు** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. పోటీవారిలో గౌరవం లభించగలదు. మీకు ముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించ గలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మకరం:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం:** మీ చాకచక్యమే అన్ని వ్యవహారాల్లో అనుకూలతను సాధించ గలదు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**మీనం** కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

— మహేష ●

ప్రశ్నలని 'ప్రశ్నావళి', ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1 కి పంపాలి.

# మాయమనసులు



పట్నంలోని కలవారి లోగిళ్ళతో పోల్చి మాస్తే చెప్పలేముగాని ఆ వీధిలో ఆ చిన్నమేడ నామంలేని దేశం ముదపు చెట్టులా ప్రత్యేకతను పెంచుకుంటోంది. వాకిలి వరండా, దాని వెనుకున్న హాలూ, అటూ ఇటూ గదులూ — క్రింది అంతస్థులో మేడ భాగం అంత వరకే! సందువైపు వసారా విశ్రాంతికి పాతకాలపు దోనె పెంకు కలపాయనయోగింప బడింది. మేడమీద హాలుభాగం మాత్రం డాబా. దానికి కుడి యెడమగా పెంకుటి వసారాలున్నాయి. అయితే యిది రైల్వే పెంకు. వాకిలి వరండా యెడమవైపు నుంచి మేడమీది భాగానికి మెట్లున్నాయి. అవి కొయ్యమెట్లు. మేడగావే పైన ఉండేవారికి ఆ మెట్లు యెక్కి దిగడంలో ఒక రక్షణ పొందడం అవసరమనిపించింది. మెట్లమీద వర్షపునీరు పడకుండా రేకులతో ఒక ఆచ్ఛాదన (షేడ్) వుంది.

అతేనేం! ఆ యిల్లు శ్రీహరికి దక్కరగావచ్చి చూసేవరికి పై భాగానికి 'రూమ్ టులెట్' అన్న బోర్డు కూడా కనిపించింది. అప్పటికి సూర్యుడు నడినెత్తిమీద ఉన్నాడు. ఉదయం కాసిని టీ నీళ్ళు గొంతులో పోసుకొని అన్వేషణకు బయల్దేరాడతను. ఇప్పుడీ బోర్డు చూసే వరికి అరగంటనుంచీ అవుతున్న దాహం మాటకూడా మరచిపోయాడు. ప్రతిచోటా 'లేదన్న'మాటే. ఉన్నా 'ఫామిలీ పోర్షనండీ! ఫామిలీస్‌కే యిస్తాము'. అవే అడవారి తలుపుచాటు సమాధానాలు.

వరండాలోకి వచ్చేసరికి గిర్రున తిరిగిన కళ్ళతోపాటు తలకూడా తిరిగిందతనికి. కొన్ని సెకండ్లకు యథాస్థితికి వచ్చి 'ఏవరండీ యింట్లో' అన్నాడు మెల్లగా.

'ఏవరూ?' అన్న స్త్రీ కంఠం వినిపించింది. ఆతరువాత తలుపు తెరచుకుని ఒకామె వచ్చి అతనికేసి ప్రశ్నార్థకంగా చూసింది.

'పెద్దవారెవరూ లేరాండీ?'

ఆమె, అత ప్రశ్నకు సమాధానమివ్వకుండా 'మీకేంకావాలి?' అని ఎదురు ప్రశ్న వేసింది.

'పైన టులెట్'బోర్డు చూశాను.'

'మీకు కావాలా?'

'అవును'

'బ్రహ్మచారిలా?'

అతను సంకోచిస్తూ తలువూపాడు. అన్ని యిళ్ళదగ్గర యెదురైన సమాధానమే యిక్కడా వస్తుందనుకున్నాడు.

'పైన నీళ్ళవసతి లేదు. స్నానానికి మిగిలిన అవసరాలకీ క్రిందికే రావాలి. మునిసిపాలిటీ వారికికూడా ఈ వీధి సంగతి అంతగా పట్టనందువల్ల యిక్కడ దోమల బాధకూడా ఎక్కువే. ఏప్పుడో వేయించిన వైరింగు కావడంవల్ల కనిపించే లైట్లను చూసి కరెంటు వుందని భ్రమ పడటం అనవసరం.' అన్నదామె అతనిని పరీక్షగా చూస్తూ.

'ఇంతకీ అద్దె ఏంతో?'

'ఏమిటి మీరు తీసుకుంటారా ఆ గది?'

'తప్పకుండా తీసుకుంటాను. ఇంటివారే తమ ఇంటినిగురించి ఏమి దాచకుండా చెప్పి వప్పుడు,—'

'ఈ ఇల్లు నాదికాదు. నేనూ అద్దెకే.

ఉంటున్నాను.'

'నేను' అంటే ఆమెతో ఇంకెవరు లేరా? ఒంటరిగా ఈ ఊరివివర ఇంట్లో ఆమె ఎలా ఉండగలుగుతోంది. కాని శ్రీహరి తన సందేహాలు బయటపెట్టలేదు.

'ఇంటి యజమాని ఎవరో చెప్పండి! అతనిని కలుసుకొని గది ఖాయం చేసుకుంటాను,' అంటూ ఆమె ముఖం చూసి 'నన్ను గురించి నేను చెప్పుకుంటూన్నా ననుకోకండి. నేను కొత్తవాడననే సందేహం మీకొద్దు. నేను ఇక్కడ ఉన్నన్నాళ్లు మీకు తోడుగా ఉంటాను', అన్నాడు శ్రీహరి.

ఆమె అతనివంక అయోమయంగా, అవహాసంగా చూసింది.

'అతను యెక్కడుంటాడో మీకు తెలియదా ?'

'ఈ పట్నంలో మీకీ గదితప్ప మరొకటి కనిపించలేదా ?'

శ్రీహరి నవ్వాడు. 'ఏం ? నేనిక్కడ ఉండటం మీకిష్టంలేదా ? అన్నాడు.

ఆమెకూడా చిన్నగా నవ్వింది. కాని అంతలోనే ముఖభంగిమను గంభీరంగా మార్చి 'నా ఇష్టాయిష్టాలతో ఇంటి యజమానిని నష్టపెట్టే హక్కు నాకు లేదు.' అన్నది.

ఆతరువాత అడ్రసు చెప్పింది.

ఎందుకో ? తను ఇక్కడ ఉండటం ఆమె కిష్టంలేదు. ఆ విషయం అతనికి స్పష్టంగా తెలిసింది. అయినా జాగ్రత్తగా ఆమె చెప్పిన అడ్రసు వ్రాసుకొని వెళ్ళి పోయాడు.

* *

మరో రెండు గంటలలో అతని మేడ మీద గదిలో ప్రవేశించడం జరిగిపోయింది. వినగానే అద్దె తక్కువనిపించినా అడుగు పెట్టిన మునిముషంలోనే అతను కొంత అసంతృప్తికి గురి అయినాడు. నేలమీద గచ్చంతా మనిషి నేలమీద పడుకోడానికి వీలేలేనివిధంగా గుంటలు పడి పోయింది. పడకమాట అలాఉంచి నడవటం గూడా కాస్త కనిపెట్టి నడవకపోతే ఎదురుదెబ్బలు తప్పేలాగ లేవు. గోడలకు వెల వేసి సంవత్సరాలు దాటినట్లుగా ఉంది. ఒక అలమారా కూడలేదు. గోడలకు నాలుగువైపుల రకరకాల సైజుల మేకులు— కొట్టినవారు వచ్చినవి బంవంతాన పీక్కుపోగా ఊడిరానివి మిగిలి ఉన్నాయి. అవి చూడగానే దుకాణాల్లో షో బోర్డులకు తగిలించే రకరకాల తాళాలూ, గడియలు తలపుకొచ్చాయి. పైకి చూసేసరికి మేడమీద మొలిచిన ఏదో చెట్టు తాలుకు వేరు పూలంగా పైకప్పు నుంచి గోడసగంవరకు అతుకు కనిపించింది. వెలుతురు కాబట్టి సరిపోయింది. చీకట్లో పామనుకొనే భ్రమ ప్రమాదం తప్పించి. బల్బు కొంటానంటే 'ప్రస్తుతం కరంటు చెడిందని వారంరోజుల్లో రిపేరు చేయిస్తానని' ఇంటియజమాని చెప్పారు. శ్రీహరి కిటికీ క్రిందిరెక్కలు కూడా తెరిచాడు. పడమటియెండ గదికిటు చివరిగోడవరకు ఆక్రమించింది. అప్రయత్నంగా తూర్పు కిటికీవైపు చూశాడు. ఉదయ సూర్య కిరణాలను గదిలోనికి ఆహ్వానించడం ఆకిటికీ డ్యూటీకాబోలు. గదికున్న వసారాలు ఉత్తర దక్షిణాలు కాకుండా తూర్పు పడమరలుగా ఉంటే బాగుండేదనిపించింది. తన ఊళ్లో అయ్యగారు చెప్పే వాస్తుశాస్త్రం ప్రకారం ఈ యిల్లొక ఇల్లేకాదు. దయ్యాలకొంప ; అమంగళనివాసం !

నేలమీద దుమ్ము ఎక్కువగా లేదు శ్రీహరి సామాను చాల తక్కువ. ఒక బకెట్టు, చెంబు, కూజా, రెండు గాజు గ్లాసులు, చాప, బెడ్డింగు, రెండు ట్రంకు పెట్టెలు. ఈ కొద్దిపాటి సామానును అతను తనకెలా బాగుంటుందనిపిస్తే అలా సర్దేశాడు.

భావిదగ్గరకు వెళ్ళి, కాళ్ళు ముఖము కడుగుకొన్నాడు. కూజాలో నీళ్ళునింపి తెస్తూ ఉంటే క్రిందివాటాలో ఆమె బయటకువచ్చి 'ఆ నీరు త్రాగుతారా ఏమిటి? పేరుతెలియని పురుగుల దగ్గరనుంచి నీటి పాములవాక ఉన్నాయా నీటిలో,—పైగా ఆ నుయ్యి అలముపడి కుళ్ళి,— కూజా యిలా ఇవ్వండి మంచినీళ్ళిస్తాను,' అంటూ అతని చేతిలోని కూజా అందుకుని నీరు పారబోసి లోపలనుంచి మంచినీళ్ళు తెచ్చియిచ్చింది.

కూజా అందుకుంటూ 'ఇక్కడెవరైనా పనిమనిషి దొరుకుతుందా?' అని అడిగాడు.

'ఏమేం పనులు చెయ్యాలి ?'

'గది చిమ్మడం, నాకు స్నానానికి, త్రాగడానికీ నీళ్ళు తెచ్చిపెట్టడం, ఇంకా ఇలాంటివే మరి కొన్నిపనులు'—

'మీరు స్నానం మేడమీద చేస్తారా? అయితే క్రింద నేనుండే పని లేదు. వర్షాకాలం చెట్టుక్రింద నయమనిపిస్తుంది.'

'అలాగా! ఇల్లుఅంతా కురుస్తుందన్న మాట.'

'అన్నరా ఏమిటి? ఇది కూలగొట్టమని మునిసిపాలిటీవారు రెండేళ్ళనుంచో నోటీసు లిస్తున్నారుట. ఏమి పైరవీ చేస్తున్నాడో మరి! ఇల్లు దావా తటదే కూలితే కొంత ఖర్చు కలిసి వస్తుందనో ఏమో, అలాగే ఉంచుతున్నాడు.'

'వర్షాకాలం ప్రమాదమే!'

ఆమె నవ్వింది వెంటనే సీరియస్‌గా 'గదిలో మీరు ఒక గ్లాసునీరు ఒలికించినా క్రింద నేను ఇబ్బంది పడవలసి ఉంటుంది' అన్నది.

ఆమె లోనికెళ్ళి తలుపేసుకుంది. ఆమెలోని క్షణపరివర్తనా స్వభావం అతనికెంతో ఆశ్చర్యం కలిగించింది. పైకెళ్ళేసరికి ఆశ్చర్యం ఒక్కొక్క మెట్టు అదృశ్యమై ఆస్థానే జిజ్ఞాస పెరిగింది.

ఊరికి చివరగా—! పాడుపట్ట మేడలో,—! ఒంటరియువతి,—!?

* * *

హోటలుకువెళ్ళి కాఫీ త్రాగివస్తూ వీధి కొళాయిదగ్గర అప్రయత్నంగా ఆగాడతను. అక్కడ నీటికోసం దలాటా జరుగుతోంది పరిచయమైన స్వరం. 'నేనసలు సాయంత్రం మొదలుకన్నా నీళ్ళకొచ్చానా? ఇవ్వాళే రావలసి వచ్చింది. నన్ను పట్టుకెళ్ళనివ్వండి. అంటువుదామే. మిగిలిన వారంతా ఆమె మాట దొరనివ్వకుండా తమ హక్కుకోసం మాటలతోని బిందె తీసి పక్కనే పడేటం ద్వారా వేతంతో పోరాడుతున్నారు. తనకు నుంచి నీరివ్వటంవల్ల ఆమె నీటికోసం రావలసి వచ్చిందా? అనే సందేహం కలిగిందతనికి. అడుగులు పెద్దవిచేసి త్వరగా తన గదికి వచ్చేశాడు. మేడమీది నుంచి చూశాడు. ఆమె వడకనుబట్టి ఆమె మోస్తున్నది ఖాళీబిందె అనిపించింది. తన రెండు గ్లాసుల్లోనూ నీరు నింపుకొని కూజా

అతనికి వలభై ఏళ్ళుండవచ్చు. గట్టిగా, దిట్టంగా వస్తాదులా ఉన్నాడు. మెడలో హనుమంతుడి వెండి బిళ్ళా — దండ కొక్క రాగి తాయిత్తు, గళ్ళ లుంగీ మోకాళ్ళదాకా లక్కీ! జబ్బలదాకా పైకి మడిచాడు. పక్కనే శిష్యుడిలా మరొక పిల్ల వస్తాదు.

'బీడీ ఉందా పంతులు ?'

శ్రీహరి పెట్టె తీసి తెరిచి రెండు సిగరెట్లు ఇచ్చాడు.

'పంతులు! నా పేరు గంగులు. ఇంకా చెప్పాలంటే ఈ గంగులు విరిచిన యెముకలు డాక్టరుబాబులు మాట అలా యుంచి పుత్తూరు వైద్యులు కూడా అతకలేరని పట్నమంత చెప్పుకుంటారు. సందేహకాణ్ణించి వడిరేతిరాకా ఇదే మన అడ్డా. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఇది అసలే అడ్డాల బజారు. తెలిసో తెలియకో యీడ దిగావు నువ్వు. అయినా సరే! నీ మీద ఈగ వాలినా నాకొచ్చి చెప్పు. ఆ యీగెను సరిగ్గా కాల రాస్తాను' అన్నాడు గంగులు.

శ్రీహరికి నోట మాట రాలేదు. ఫలానా అని స్పష్టీకరించలేని ఆలోచనలు అతని మస్తిష్కంలో పరిభ్రమించ సాగాయి. 'అలాగే' అని గంగులుకు సమాధానం చెప్పి నడక సాగించాడు.

'పంతులు బెదిరాడు గురు' అని చిన్న వస్తాదు అనడం, ఇద్దరుకలిసి నవ్వుకోవడం వెనకనుంచి వినిపించింది.

* * *

వస్తూవుంటే కనిపించిన కొన్ని దృశ్యాలు 'అడ్డాల బజారు' అని గంగులు అన్నదానికి వ్యాఖ్యానాలు చెప్పాయి. చవకబారు ముసుగులు, ముతక బూతులు, తలుపులు వేసుటాలు తీయటాలు, వీధిలో నిరీక్షిస్తూ తారాడే పురుషులు అడ్డాల బజారును గురించిన సంక్షిప్త సమాచారాలు. ఒకచోట నలుగురు యువకులు ఒక స్త్రీ చుట్టూ ప్రదక్షిణం చేస్తూ బతిమాలుతున్నారు. 'నిన్ను సంతోష పెడతాం' అంటున్నారు. 'కాని డబ్బులతోనే మా దుంప తెంచేవు' అంటున్నాడొకడు.

'మా అయ్యో!' అంటూ ఆమె ఏదో అందుకు తగ్గ సమాధానం చెప్పింది. అంతా నవ్వుకున్నారు.

శ్రీహరి వడి వడిగా తన గదిలోకి వచ్చి పడ్డాడు.

కిరోసిన్‌లాంప్ మాట వదిలేసి చీకటిని చూసాక గుర్తొచ్చింది. తడుముకొంటూ వెతికి మరో కొవ్వొత్తి వెలిగించాడు. తలుపు గడియవేసి పక్క సరిచాడు. బట్టలు మార్చుకొని రెండు గ్లాసుల నీరు త్రాగి పడకపై వరిగాడు. సిగరెట్టు వెలిగించి రెండు దమ్ములు లాగాక అతను కాస్త స్థిమితపడ్డాడు.

సిగరెట్టు కాసేపట్లో బూడిద అయింది. కానీ నిద్ర మాత్రం రాలేదు. తను మగవాడు. ఎలాగో సర్దుకు పోగలడు. కాని క్రిందనున్నామె ? ఆమె ఇలాంటి వాతావరణంలో ఏదుకున్నట్లు? ఎలా గడుపుతున్నట్లు? కొంపతీసి ఆమె కూడ ఇలాంటి బాపతే కాదు కదా!

మధ్యాహ్నం గది విషయంలో ఆమె మాట్లాడిన మాటలు గుర్తొచ్చాయి. తనడిగిన విషయాలు తప్పించి ఆమె మరొకటి మాట్లాడకం, సహజ లక్షణంగా ప్రకోపించే హావభావాలను బలవంతంగా అణిచేసి నిప్పటికప్పుడు గంభీరంగా ఉండాలని ప్రయత్నించడం—అదంతా ఎందుకు ?

మంచినీళ్ళ తతంగం మనసులో మెదిలింది. అతనికి తనపై తనకే ఒకరకమైన ఏవగింపు కలిగింది. గది విషయంలో ఆమె హెచ్చరించినా తను తొందరపడ్డాడు. ప్రసాద్ వచ్చి ఈ వాతావరణం చూస్తే ఏమనుకుంటాడు ? ఒక్క ప్రసాదే ఏమిటి? ఎవరైనా ఏమైనా ఊహించగల అవకాశం సంపూర్ణంగా ఉంది. ఇంక ఆ రాత్రి అతనికి నిద్ర రాలేదు. ఎంత పొద్దుపుగా నిగ్రహంగా వాడినా సిగరెట్ పెట్టె ఖాళీ అయింది. ఖాళీ డబ్బా పారేయడానికి గది తలుపులు తెరిచి మేడ చివరకు వచ్చాడు. వీధిలో ఇద్దరు సూటువాలాలు నిలబడి ఉన్నారు. దాపునే ఒక రిక్షా ఆగి ఉంది. రిక్షావాడు అప్పుడే లోపలినుంచి వచ్చి వారితో యేదో చెప్పి తన రిక్షా సందు చివరివరకు లాక్కొని వెళ్ళాడు. హోటల్ దగ్గర తమను 'రిక్షా కావాలా' అని అడిగినవాడే నని పించింది శ్రీహరికి. సూటువాలాల్లో ఒకతను లోపలకు వెళ్ళాడు. మరొకతను సిగరెట్ కాలుస్తూ బయటే నిలబడ్డాడు. శ్రీహరి కెందుకో కడుపులో దేవినట్లయింది. భరించలేని అపరిమితమైన అసహ్యతో వేగిపోయాడు. 'ఆమె కూడా అలాంటి మనిషే!' అన్న సత్యాన్ని అతను జీర్ణించుకోలేకపోతున్నాడు. 'ఆమెకు నీకు ఏమిటి సంబంధం? ఎందుకు నీకీ బాధా?' అని మనస్సు ఏవో ప్రశ్నలతో హెచ్చరించింది. కాని ఆ హెచ్చరిక అతనిని యధాస్థితికి తేలేకపోయింది.

గదిలోకి వచ్చాకా అతనికి తిరిగి సిగరెట్ అవసరం కనిపించింది. కాని లేదు. క్రొవ్వొత్తి కరిగిపోయి చీకటి మిగిలింది. అగ్గిపుల్లలు వెలిగిస్తూ పారేసిన పీకలన్ని ఏరి కాగితంతో గొట్టాంమల్చి ఒక స్పెషల్ సిగరెట్ తయారుచేసి వెలిగించాడు.

* * *

వారంరోజులు గడిచింది. ఈ వారం రోజుల్లో అతనికి ఆ వీధిని గురించిన మరికొన్ని విషయాలు తెలిశాయి.



ప్రతిరాత్రి ఏదో ఒకటింట్లో మొగుడు పెళ్ళాలు పోట్లాడుకొని వీధినొక కొలిక్కి తెస్తారు. జడివానకురిసి వెలిసినట్టు అర్ధగంటలో అంతా సర్దుకుంటుంది. ఆ కొద్దిసేపట్లోనే రెండుపార్టీలు. ఒకటి మొగుడిపక్షం—రెండవది పెళ్ళాంపక్షం. మొగుడి పక్షానికి సంఖ్యాబలం తక్కువగా ఉంటుంది. మగవాడు కనుక. ఆడకూతురి పార్టీకి సంఖ్యాబలం ఎక్కువ. పదినిమిషాలు గడిచేసరికి భర్తపార్టీ కాస్తా మధ్యవర్తి బృందంగా మారుతుంది ఆతరువాత అంతా ఆడకూతురికే 'జయ్' అంటారు. మొగుడు పాపం 'ఆడకూతుర్ని' రోజూ తాగివచ్చి హింసించే దుర్మార్గుడు గాక, రౌడీగాను లెక్కకొస్తాడు. దానితో అతను రేగిపోయి ఏమీచేయలేక పెళ్ళానికి మధ్యవర్తులకు 'రంకు' కడతాడు. అందరు కలసి వాడిని పరిహాసం చేస్తారు. నోరెత్తనివ్వరు. ఒకవేళ నిజంగా 'రంకు' ఉన్నా సహించి భరించాలనే స్థితికి తెస్తారు.

ఉదయ సాయంత్రాల్లో సూర్యుడుదయించి అస్తమించడం ఎంత సాధారణమైన విషయమో ఆ వీధిలో పంపుగలాటాల్లాంటివి అంత నిత్యకృత్య కార్యక్రమాలు. ఇంక స్త్రీలు అసలు ఉలుకు ఏదో కడుపులో దాచుకొని మరేదో కారణం కెలికి తీసి వేసుకొనే జగడాలు కనీసం రోజుకొక అరడజనైనా ఉంటాయి.

పోతే గంగులు సందు చివర మోహరీ మీనా కూర్చుని సాయంత్రం నుంచి అర్ధరాత్రి వరకు డ్యూటీ చేసినందుకు ముప్పై నెలసరి ముట్టుబడి గెజిటెడ్ ఆఫీసర్ జీతానికి కాస్త అటూ ఇటూగా ఉంటుంది.

డబ్బు దగ్గర పేచీ పెట్టినవారు, స్త్రీల దగ్గర వారు భరించలేని స్థితి కల్పించినవారు గంగులు చేతివాటం రుచి చూస్తారు. అలాంటివారి ఆర్తనాదాలు ఈ వారంలోనే మూడుసార్లు విన్నాడు శ్రీహరి. సందు చివరకు అప్పుడప్పుడు వచ్చే పోలీసులకు కూడా గంగులే సమాధానం చెప్పుకుంటాడు.

గడచిన ఆదివారం ప్రసాద్ శ్రీహరి రూంకు వస్తామని ప్రతిపాదించాడు. కాని శ్రీహరి ఉపాయంగా తనే అతని రూంకు వెళ్ళాడు. సాయంత్రం వరకు అతనితో సినిమాకు వెళ్ళి రాత్రి పది గంటలు దాటాక తన గదికి చేరాడు.

పగలంతా ఆఫీసులూ—ఆఫీసర్ల చుట్టూ తిరగడంతో పాటు తనకు వేరొక గది కోసం వెదకటం కూడా ధ్యేయంగా పెట్టుకున్నాడు. ఉద్యోగం దొరికే సూచనలు ఎండమావుల్లా, తళుక్కున మెరిసి మాయమౌతున్నాయి. శ్రీహరి పెట్టెలో ఎంతో పొదుపుగా వాడే మొత్తం నానాటికీ కరిగిపోతూ అతనికి బ్రతుకు భయాన్ని పెంచుతూంది. మరొకవైపు వేడి రక్తానికి సహజమైన యవ్వనజ్వాల అతనిని నిద్రకు దూరంచేసి దాహాన్ని పెంచుతూంది.

...కాలేజిలో అతను చాలా ఉపన్యాసాలిచ్చేవాడు. విజ్ఞానార్జన నిమిత్తం అందరు విద్య నభ్యసించవచ్చు గాని వెనకాల ఏమాత్రం ఆస్తిపాస్తులున్నవారైనా ఉద్యోగానికి యెగబడరాదని అది ఉద్యోగం జీవితావసరమైన మరొకరికి అన్యాయం చేయడమేనని అతని వాదన. తనమటుకు తను విజ్ఞానం కోసమేగాని, ఉద్యోగం కోసం చదవడం లేదని ప్రమాణం చేసి చెప్పాడు. కాని చదువు పూర్తిచేసి ఇంటికి చేరేసరికి తండ్రి రాజకీయ వ్యామోహంలో పడి ఆస్తి హారతి కర్పూరంలా హరించుకు పోవడంతో మనోవ్యాధితో మంచం పట్టి తనువు చాలించాడు. మిగిలినది అప్పులవారికి జమకట్టి చేతిలో మిగిలిన కొద్ది మొత్తంతో పట్నం చేరాడు. పరిస్థితులను చర్చించి అతను ఉద్యోగి కావడం తప్పనిసరి అని తేల్చాడు ప్రసాద్.

* * *

ఆ రాత్రి శరీరాన్ని అదుపులో పెట్టుకోలేక పోయ్యాడు. పెట్టెలోని మొత్తంలో కొంత భాగం తీసుకొని వీధిలోని ఏగుమ్మంలోనో జొరబడి శరీరపు వేడి కొంతైనా చల్లార్చుకోవాలని అతని ప్రాణం అలమటిస్తోంది. ఆ గుమ్మం తనున్న మేడలోనిదే ఎందుకు కాగూడదు? రోజూ అతను క్రిందికి వెళ్ళి స్నానం చేసి వస్తున్నాడు. కాని ఎప్పుడూ ఆమె ఇంటి తలుపులు మూసే ఉండేవి. ఎప్పుడైనా తెరచివున్నా అతని అలికిడి గమనించి మూసుకొనేవి. వచ్చిననాడు తప్ప ఆమె అతనితో మళ్ళీ ఎప్పుడూ మాట్లాడలేదు. రాత్రి భోజనానికి వెళ్ళి వచ్చేటప్పుడు గంగులు రోజూ పలకరిస్తున్నాడు: కొందరు ఆడవారు అతనిని పరీక్షగా (సరియైన మగాడేనా అన్నట్టు) చూస్తున్నారు. వారి చూపులు చాలా అవమానంగా అతన్ని రెచ్చగొడుతున్నట్టుండేవి.

ఆ రాత్రి పదిగంటలు దాటాక ఒక యాభైరూపాయలు తీసుకొని గదికి తాళం వేసి మెట్లు దిగాడు దడ దడలాడే గుండెలతో వణికే వేళ్ళతో ఆమె గుమ్మం తలుపు తట్టాడు. ఆమె తలుపు తీసింది. చటుక్కున లోపలకు వచ్చాడు. దగ్గరున్న యాభైరూపాయలు టేబుల పై పెట్టి ఆమెకేసి నడిచాడు.

ఒకడుగు వెనక్కువేసి 'ఏమిటి! ఏమిటండి?' అన్నదామె

'అర్ధం కాలేదా?' అతని గొంతు వణికింది.

'ఏమైంది ఈవాళ మీకు.?'

'అందరూ దేన్ని తట్టుకోలేక ఇక్కడికి వస్తారో అదే అయింది.'

'ఆ డబ్బు తీసుకొని ఇక్కణ్ణుంచి వెళ్ళండి!'

'ఇది చాలలేదా? తక్కువైందా? ఇంకా ఇస్తాను.' కొంచెం ధైర్యం వచ్చిందతనికి.

'వెళ్ళమంటున్నాను. ముందు వెళ్ళండిక్కణ్ణుంచి.'

'ఎందుకు వెళ్ళాలి' అంటూ ముందుకు నడిచి ఆమెను పట్టుకున్నాడు. బలవంతాన మంచంవైపు గుంజుకు వెళ్ళాడు. బలంగా పెనుగులాడి విడిపించుకొని 'మీరు నాకిష్టంలేదు. వెళ్ళండి. గొడవ పెంచకండి' అన్నదామె.

'ఎందుకిష్టంలేదు?'

'నేను జవాబు చెప్పనవసరం లేదు. అది నా యిష్టానికి సంబంధించిన విషయం.'

'పతివ్రత పోజు పెడుతున్నావా? రోజూ వచ్చి వెళ్ళేవారిదగ్గర ఏమైంది పోజు' అంటూ ఆమెను లాగి మంచంమీద పడవేసి పక్కన చేరాడు. దగ్గరకు లాక్కున్నాడు. గుండెలు కదుముకోవాలని పూర్తి బలంతో ప్రయత్నించబోగాను. ఆమె ముఖం త్రిప్పుకొంది. జుట్టు పీకింది. ముఖాన్ని రక్కింది. అతను వదలలేదు. చివరి ప్రయత్నంగా ఆమె అతని భుజాన్ని గట్టిగా కొరికింది.

'అబ్బా' అంటూ వదిలేశాడు.

ఆమె ఒక్క ఉదుటున లేచి మంచానికి దూరంగా నిలబడింది. 'వెళ్ళండి'

'ఛీ' అతను ఉమ్మేశాడు.

ఎర్రబడిన కళ్ళతో సమ్మం వైపు చేయి చూపించింది. అతను లేచి బయటకు వచ్చేశాడు. డబ్బు మాట గూడా మరచి పోయాడు. ఆ రాత్రి అతని అవస్థ అతనికి దైవానికి మాత్రమే తెలుసు.

* * *

'హరీ! శ్రీహరీ!!'

శ్రీహరి ఉలిక్కిపడి లేచాడు. కిటికీ ముందరా వెనక్కి వెళ్ళిన ఎండ చాలా ప్రొద్దెక్కిందని చెబుతోంది. ఆ గొంతు ప్రసాదుది. లేచివెళ్ళి తలుపు తీశాడు. ఆశ్చర్యంగా చూశాడు.

'నీ రూం ఎలా తెలిసిందనీ ఏంతగా ఉందా? నీవు చెప్పకపోయినా తెలుసుకోగలం లేవోయ్' అంటూ లోపలకు వచ్చాడు.

'కూర్చో. ముఖం కడుక్కొని ఇప్పుడే వస్తాను.'

'అదేమిటి నీముఖం అలా ఉంది? ఆ గాట్లేమిటి?'

గతుక్కుమన్నాడు శ్రీహరి. 'ఒకటే దోమలు నల్లులు! నిదరలో బరుక్కొని ఉంటాను.' అన్నాడు.

'అరే! కిటికీదగ్గర రూపాయలు అన్నీ పడుతున్నాయి నోట్లు.'

శ్రీహరి అయిదునోట్లు ఏరి లాల్చి జేబులో పెట్టాడు. 'కూర్చో ఇప్పుడే వస్తాను.' అంటూ బకెట్టు, టవల్ తీసుకొని కిందికి వెళ్ళాడు.

ఇరవై నిమిషాల్లో యిద్దరూ క్రిందికి వచ్చారు. ప్రసాద్ ఏమైన రెట్టించి అడుగుతాడేమో అని శ్రీహరి సంకోచ పడుతున్నాడు. విషయం ఏదో ఉందని గ్రహించినా అతని అభిమానాన్ని గుర్తించి అతను చెప్పినప్పుడే విందామని ఊరు కున్నాడు ప్రసాద్.

మెట్లు దిగగానే 'అన్నట్టు అసలు విషయం చెప్పనేలేదు. ఇప్పుడు నీ దగ్గర డబ్బు ఎంతఉంది? భయపడకు అప్పడి గనుతే' అన్నాడు ప్రసాద్.

'భలేవాడివి! ఎందుకూ?'

'అవసరమోయ్ నీకోసం ఒక ఉద్యోగాన్ని బేరంచేసి సిద్ధంగా ఉంచాను.'

'అంటే? అర్థమయేలా చెప్పు?'

'అంటేనా! ఒక ఎనిమిది వందలు నీవి కాదనుకుంటే ఒక ఉద్యోగం సిద్ధంగా ఉంది.'

'లంచమా?'

'ఏం యివ్వవా సత్యహరిశ్చంద్రా?'

'ఉండు యిప్పుడే వస్తాను' అంటూ మెరుపులా పైకివెళ్ళి నిరుత్సాహంగా తిరిగి వచ్చాడు.

'లాభంలేదు అంతా కలిపి ఐదువంద లుంటుందేమో!' అన్నాడు నీరసంగా.

'సమయానికి నా దగ్గరా లేకపోయిందే'

'పోనీలే మరొకటి.' నిట్టూర్చాడు.

'ప్! ఈ రోజుల్లో ఉద్యోగం మాటలు కాదోయ్! క్రైండ్, క్యాష్ ఆర్ రెకమెండే షన్ ఎస్సెన్షియల్. నువ్వు మగాడివి గనుక ఫ్రెండ్ అనే శబ్దానికి అనర్హుడివి. రెకమెం డేషన్ ఉంటే యిన్నాళ్ళు నిరుద్యోగిగా ఉండే వాడివి కావు. క్యాష్! గోస్ వన్ వే ఫర్ యు. ఎంత ఉందన్నావ్.'

'ఐదు వందలు.'

'ట్రై ఫర్ త్రీ హండ్రెడ్! నేనూ ప్రయత్నం చేస్తాననుకో. అయినా నా మీద అంత ఆశ పెట్టుకోకు యిరా ట్రై యువర్ లెవల్ బెస్ట్. ఒక్క రెండు మూడు రోజులలో సంపాదించవచ్చు.'

'లాభం లేదు ప్రసాద్.'

'ఛ' అలా నీరుకారి పోతావేమోయ్! మీ వూరెళ్ళు.'

'ఏముం దక్కడ? పూరిల్లు! దాని చుట్టూ వున్న కొద్ది జాగా! తెగనమ్ముదా మన్నా రెండు మూడు రోజులలో అయ్యే పని కాదు. మన వత్తిడి పసిగట్టారంటే, మరి బిగుసుకుపోతా రక్కడి స్థానికులు.'

'సరే పదా! ఈ విషయంకోసం నిన్ను వెతుక్కొంటూ వచ్చాను. నీ అడ్రసు నిన్న నాతో హోటల్లో చూచిన ఒక మిత్రుడి వల్ల దొరికింది. అతని కెలా తెలిసిందంటే అది చెప్పే విషయం కాదనుకో! అయినా ఏమిటోయ్! పట్నంలో మరొక తావు లేనట్టు ఈ వీధిలోకి వచ్చి పడ్డావు. నీగదీ తీరా నేనుకాక మరెవరైనా వచ్చి ఉంటే ఎంత హాస్యాస్పదంగా వుండేది.'

శ్రీహరి నోరెత్తలేదు.

'చొరవకొద్దీ అన్నాను. ఏమీ అనుకోకు. అది సరే గాని మంచి బెంగాలీ పిక్చరుంది, వెళదామా? స్పెషల్ మార్నింగ్ షో!'

'పద!'

వరండా దిగి వీధిలో పడ్డారు. నిడదవంచి కరకరలాడే ఎండలోకి వచ్చేసరికి శ్రీహరికి కళ్ళు తిరిగినట్టయింది.

* * *

సాయంత్రం గదికి వచ్చాడు. అతడి మనస్సు తన కలభ్యమైన మూడు పచ్చ కాగితాల కోసం రెపరెప లాడుతోంది. గది తాళం తీసి లోపలికి వచ్చాడు.

కిటికీ వారగా ఏమిటది? ఆత్రంగా పరుగెత్తి చూశాడు మనస్సులోని తత్తర పాటుకి కన్ను చెదరలేదు కదా! కానీకాదు కళ్ళు నులుముకొని మళ్ళీ చూసినా అదే దృశ్యం! మూడు పచ్చ కాగితాలు. మూడు వందలు. అయిదు ప్లస్ మూడు వెరసి ఎనిమిది ఈ జీ క్యాల్ ఉద్యోగం. తను



ఉద్యోగి. దైవం దయ తల్చాడు: కాని ఎక్కడిది? ఎక్కడికెలా వచ్చా? (ప్రసాద్ అనుమానికి అవకాశం లేదు. ఇప్పటి వరకు అతను తనతోనే వున్నాడు. అతను గూడా ప్రయత్నిస్తా నన్నాడు గదా! అత నడిగిన స్నేహితు డెవరైనా తన అవసరాన్ని గమనించి వచ్చి పడేసి వెళ్ళి ఉండగూడదా! తను ప్రసాద్ విడిపోయి గంటైనా కాలేదే ఎంత లోనే ఇంత హుటాహుటిగా ఇప్పిన్చిన ఉదారుడెవరో?

ఏమైనా శ్రీహరి ఇంక ఆలస్యం చెయ్య లేదు పెట్టెలోని ఆయుదాను ... తలిసి మడతవేసి జేబులో పెట్టాడు. ప్రసాద్ దగ్గరకు బయలుదేరాడు.

వీధిలో పదడుగులు వేసాక యెందుకో వెనక్కి తిరిగి చూశాడు. వరండాలో ఆమె నిలబడి ఉంది. అతని మేధస్సు మెరుపులా పని చేసి జరిగినదాన్ని స్పష్టంగా నిర్ణయించింది. వెనక్కి తిరిగాడు. ఆమె వరండాలో నుంచి లోపలకు వెళ్ళింది. తలుపు పూర్తిగా మూసుకోక ముందే అతను బాణంలా దూసుకు వచ్చాడు.

జేబులోనుంచి పెద్ద కాగితాలు మూడు తీసి 'ఇవి నీవి కావూ?—నీవే కాదు యిది.' అన్నాడు.

ఆమె మాటాడలేదు.

'చెప్పు? నిజమేనా?' తీవ్రంగా రెట్టించి అడిగాడు.

ఆమె తలవూపుతూ 'కానీ, అప్పుగా నైనా!' అన్నది.

'అప్పా! నీదగ్గరా? ఛీ!' మూడు కాగితాలూ ఆమెవైపు విసిరాడు,

'ఆలోచించండి! ప్రపంచంలో మంచీ —చెడూ రెండూ ఉన్నాయి. ఒక మంచినే చూడగలిగితే ఎలా! చెడును కూడా చూసి ఖండించడం నేర్చుకోండి. కాకపోతే చెడును అర్థం చేసుకొని జీర్ణించుకోవటం అంత సులభమనను. కానీ నీ మీ భవిష్యత్తు...'

'ఈ మాటలు చెప్పటానికి నీవెవరవు?.

'నేను చెడినదానినే కావచ్చు కాని ఆ నోటమీద ఆ ముద్రలేదుగా! ఈ మూడు వందలూ దేవుడు ప్రత్యక్షమై తనచేతి మీదుగా ఇచ్చినా మీరుపయోగించ బోయేది దేనికోసం.

'నీ ప్రశ్నలకు జవాబులు చెప్పవలసిన అవసరం లేదు.'

# మాయ మనసులు

'నా మాటలు నాకే అప్పగిస్తున్నారా! సరే మీయిష్టం.'

అతను తిరిగి వచ్చేశాడు. ఇక ప్రసాదు దగ్గరకు వెళ్ళే అవసరం లేకపోయింది. చేసినపని అతనికెంతో తృప్తిగా ఉండి ఆత్మవిశ్వాసాన్ని పెంచినట్టుంది. పాతివ్రత్యం కోసం, ప్రతీకార కాంక్ష చల్లారకా మనసులో మిగిలేదేదో అది నిండి ఉప్పొంగుతోందతనిలో.

* * *

సాయంత్రం సంధ్యవడిలో వాలగా సంధ్యను నిశీధి ఆలింగనం చేసుకుంది.

పగలంత అశోకవనంలో సీతమ్మకు కాపలా కాసే రాక్షసుల్లా, కడుపుకిపాట్లు పడిన స్త్రీలు మసకమాపువేళకే ముస్తాబులు ముగించారు. చీకటి చిక్కబడేసరికి వాళ్ళ యిళ్ళు శోభనగృహాల్లా, కళకళలాడ సాగాయి. గుమ్మాల్లో నిలబడిన స్త్రీలు వీలైనంతవరకూ వయస్సును దాచే ప్రయత్నాలు చేస్తూ, వచ్చ్యారా పిలుస్తున్నారు.

కొందరికి మాత్రం గంగులు లేక కొందరు రిక్షావాలాలు బేరంతెస్తారు. అవి ఖరీదైన బేరాలు. ఒక్కొక్కప్పుడు వచ్చిన రిక్షాల్లో, మగువలే వెళవలిసి వస్తుంది. అది మరీ గిరాకీబేరం. అయితే రిక్షావాడు చెప్పినవేళకు రిక్షాలో ఆమె తిరిగి రాక పోతే గంగులుకు పనితగిలిందన్నమాటే!

పదకొండు గంటల ప్రాంతాన శ్రీహరి తలుపు తట్టారెవరో. తెరిచి చూసేసరికి గంగులు నిలబడి ఉన్నాడు.

'ఏమిటి గంగులూ?'

'చిక్కొచ్చిపడిందయ్యగారూ?' అన్నాడు గంగులు తల గోక్కుంటూ. 'బేరం తెచ్చాను. విప్పుడే వచ్చే దొరబాబులు— నామీది నమ్మకంతో నూనరి వచ్చారు. ఇప్పుడటది 'నాకొంట్లో బాగాలేదు పంపే సెయ్' అని. నేనేం చేయను.' అన్నాడు.

'మరి నన్నేం చెయ్యమంటావ్?'

'తమరుమీద గురి బాబూ కాస్త సెప్పా రంటే—?'...

'ఛీ, ఛీ! మీ వ్యాపారంలో నా రెక మంచేష్నా గంగులూ! నా ముందు ఇలా ఎంకెప్పుడూ మాటాడకు. పో...డితే నీతో గొడవలేనేమో కాని పరువుకోసం ప్రాణాలన్నా లెక్కచేయను.'

'అంతలేసి మాటలెందుకు బాబూ మీ కిష్టం లేకపోతే మానెయ్యండి! నన్ను మన్నించండి! అని చేతులు జోడించి వెళ్ళిపోయాడు గంగులు. మాటా నడకా తూకంగా ఉన్నాయి.

అప్పటి కప్పుడు గది వదిలేసి ప్రసాద్ రూంకో మరెక్కడికో వెళ్ళిపోవాలనిపించింది. కాని ఏదో అకస్మాత్తుగా రేగిన అనూహ్యమైన అంతరాయం అతన్ని ఆపేసింది. మనస్సులో అశాంతి. యెందుకో తెలియదు.

బహుశా ఆమె ఏడుకొని ఏడుస్తూ ఉంటుంది. ఆమెను గురించిన ఆ ఊహా దృశ్యం అతని మనో ఫలకంపై మాటి మాటికీ ప్రత్యక్షం కాసాగింది.

ఆ రాత్రంతా ఒకటేరు కలలు.

ఆమె ఏడుస్తూ వస్తుంది. 'నాకేదైనా దారి చూపండి' అంటుంది. 'నాకెవరు పనిస్తారు చెప్పండి! ఆడవారు నన్ను చూస్తూనే ఉమ్ముతారు. మగవారు మాటలు మింగుతారు. ఇంతమంది పవిత్రంగా బ్రతుకుదామన్నా బ్రతకనియ్యరు.' ఇది మరో దృశ్యం.

'నన్ను పెళ్ళి చెయ్యలేకపోగా అక్క లేచి పోయింది. తీసుకెళ్ళినవాడు మోసం చేశాడు. అవమానంతో మా నాయన పోయాడు. మా అక్క తనెలాగో చెడిందని నన్నైనా మంచిగా పైకి తెద్దామనుకుంది. కాని దిక్కుమాలిన రోగాలతో జబ్బుపడింది. నేను వచ్చి చూసి దాన్ని కాపాడటానికి నేను కూడా ఈ ఊబిలోకి దిగబడి పోయాను. ఇది నా కథ' అంటుంది మరో మారు.

అలాంటి స్వప్నాంక భాగాలతో కలత నిద్రలతో కూడిన విభాగాలతో తెల్లవారి పోయింది.

ఆ మరురోజు ఉదయం అత నెక్కడికీ వెళ్ళలేదు. ఆమెనుండు తలుపులుగానీ కిటికీ తలుపులు కానీ తెరుచుకుంటాయేమోనని చెవులు నిక్కించి ఆలకించాడు. అలాంటి శబ్దాలేవీ వినిపించలేదు. ఆ రోజంతటికీ తిండిమీద గూడ ధ్యాసపోలేదు. సాయంత్రం వెళ్ళి కొద్దిగా ఫలహారం కాఫీ తీసుకొని వచ్చాడు.

ఆరోజు రాత్రి ఆమె సందుచివరన్న భావిలో దూకుతుందేమోననిపించింది అతనికి. చీకు చిటుక్కుమన్నా లేచి నా...చిన

రకు వెళ్ళి నాలిక్కైపు చూసేవాడు.

నిన్నటివేళకు గంగులు మళ్ళా వచ్చాడు.

'ఏం గంగులూ! మళ్ళీ ఏమైనా బేరం తెచ్చావా?'

'లేదు బాబూ! ఇన్నాళ్ళంతా ఆమె తలుపు తియ్యలేదు. పిలిచినా పలకటం లేదు. ఏదన్నా మింగిందో, ఉరిపోసుకుందో అని అనుమానంగా ఉంది.'

'ఎందుకు,' అని అర్థంలేని ప్రశ్నవేశాడు.

'ఎవరి మనసులో ఏముంటదో మనకేటి తెలుసు బాబూ.'

'చూద్దాం పద!'

'రండి బాబూ గట్టిగా పిలవండి! మీరు పిలిస్తే పలుకొచ్చు.'

తీరా గుమ్మందగ్గర కొచ్చాక 'నువ్వే పిలువు గంగులూ! నేనిక్కడుంటాను' అన్నాడు.

గంగులు పిలిచాడు. 'బుల్లెమ్మా మేడ మీదయ్యగారొచ్చారు. తలుపు తెరు!' అని తలుపు బాదాడు.

మరి కాస్సేపట్లో తలుపు తెరుచుకుంది. 'ఏమిటి గంగులూ' అన్నదామె.

'ఏంటి బుల్లెమ్మా! యెందుకలా దిగాలుగా వున్నావ్? నాతో చెప్పరాదా! నిన్నటేల నుంచి లోపలిదాని లోపలే ఉంటివి. పైనుండే బాబుగారు కూడా కంగారుగా వచ్చేశారు.'

ఆమె ముందుకు వంగి శ్రీహరిని చూసింది.

'గంగులూ ఆకలిగా ఉంది కాస్త కాఫీ, టిఫిన్ తెచ్చిపెట్టు' అన్నది.

'అట్నాగే' అని వెళ్ళిపోతూ 'అయ్యగారు కాస్త కనిపెట్టి ఉండండి' అన్నాడు. గంగులూ.

'వెళ్ళిరా గంగులూ ఇంతట్లోకే చావనులే!' అందామె పొడిగా.

* * *

అర్ధరాత్రి శ్రీహరి సామాను సర్దేశాడు. ంగా కొద్దిరోజుల్లోనే సౌకర్యార్థం కొంత సామాను పెరిగిపోవడంవల్ల టాక్సీ అవసరమైంది. అంతా టాక్సీలో చేరవేసి గది తాళంవేసి మెట్లు దిగి వచ్చేశాడు. కారెక్కే ముందు ఒకసారి వెనక్కి తిరిగి చూశాడు

ఆమె అక్కడే ఉంది. 'ఏమారిలా వెళ్తారా' అన్నది.

అతను వెళ్ళాడు.

ఆమె కొంచెం లోపలికి జరిగి అన్నది. 'ఉండండి! నాకొక చిన్న సహాయం **చేయాలి మీరు! మరేంలేదు. ఏతి చివత** గంగులుంటాడు. నిన్న యెవరో వచ్చి తిరిగి వెళ్ళారు! వారిని యింకా ఈరోజు రాదలచిన వారిని కూడ తీసుకురమ్మని చెప్పకలరా!'

'నే నెందుకు చెప్పాలి.'

'చెప్పనని తిరస్కరించడానికి బలమైన కారణమేమి లేదు గనుక కనీసపు సహాయం'

'బలమైన కారణం అంటె'—?

ఆమె సమాధానం చెప్పలేదు. అతను దగ్గరకు వెళ్ళి చెయ్యి పట్టుకున్నాడు.

ఆమె వ్యా 'సామాను చేర్చేసిరండి! ఈరాత్రికుండి వెళుదురుగాని' అన్నది.

'లేదు. ముఖ్యమైన దానినే వదలి వెళ్ళేందుకు సిద్ధపడ్డాను. ఇప్పుడు నరిచి పోయిందేమిటో అర్థమైంది. రా! కారెక్కు!'

'ఉండండి! మళ్ళీ తొందర పడుతున్నారు.' అని వదలించుకొని పోయింది.

'ఈ మారు వదిలించుకోవడం నీతరం కాదు. వెళ్తూనే గంగులుతో చెప్పి వెళ్దాము. సామాను అతనిష్టం వచ్చినట్లు చేసికోనీ! ఇక్కడిది పూచిక పుల్ల కూడ వద్దు రా! ఆలస్యమౌతోంది.' అంటూ ఆమెను లాక్కువెళ్ళి కారులో కూర్చోపెట్టాడు.

చెప్పింది విని 'తొందర పడుతున్నారేమో పంతులు గారూ!' అన్నాడు గంగులు

'ఫర్వాలేదులే గంగులూ మంచి దారి ఒక్కటే! కాని అడ్డదారులు లెక్కలేనన్ని. నేనాయనకు భారమైనాడు అందులో యేదో ఒకటి దొరక్కపోతుందా?' అన్నదామె.

'అంతేలే!' అని ఒప్పుకున్నాడు గంగులు!

కారు దూరమైపోయింది.

'హోరోరి! సినిమాల్లోనే కాదు గురూ! అప్పుడప్పుడు బయట కూడా యిలాంటి వింత లగుపడుతాయి' అంటూ నవ్వాడు

చిన్న ప్రసాదు (పిల్లి ప్రసాదు)





# [illegible]వారెక్కడికి?

మహీధర రామమోహనరావు

**జరిగిన కథ**

పెళ్లయిన కొన్నాళ్లకే జానకి భర్త ఏమై పోయాడో తెలియలేదు. జానకి మాత్రం గుండె రాయి చేసుకుని బొంబాయిలోనే స్థిరపడిపోయింది. ఆమె కొడుకు రవీంద్ర. రెండు దశాబ్దాల తర్వాత ఆ వూళ్లో అడుగు పెట్టింది జానకి. సత్యానందం గారింటికి వెళ్లింది. భద్రక్కగాని, సత్యానందం గాని ఆమెని గుర్తు పట్ట లేక పోయారు. తెలిసిం తర్వాత సంతోషం పట్టలేక పోయారు. మనుమడు రవీంద్రకి స్థిరాస్తిగా కొంత పొలం యివ్వటానికి నిశ్చయించుకుంటాడు కుమారస్వామి. సత్యానందం కొడుకు రామకృష్ణ వచ్చాడని తెలిసి జానకి, రవీంద్ర, భద్ర యింటికి బయలుదేరారు. చదువుకుంటున్న రామకృష్ణ నక్సలైట్లతో చేరతానంటాడు. జోగన్న తన చర్యని పార్టీ సమర్థించాలన్నాడు. సుందరరావు అతని ఉద్రేకాన్ని చల్లార్చాడు. జోగన్న తప్పు తెలుసుకున్నాడు. క్షమాపణ కోరుకున్నాడు.

## 21

ఊరంతా తీర్థప్రజలా బాడవ పొలం కేసి వెళ్ళి చూసి వస్తున్నారు.

'జనం ఇంతకాలం ఓర్మి పట్టింది. ఇంకెంతకాలం? ప్రజలది భూమి. దానిని కుమారస్వామి హరిస్తూంటే చూస్తూ వూరుకొన్న ప్రభుత్వానికి, తన ఆస్తిని స్వాధీనం చేసుకొన్న ప్రజల్ని ఏమనడానికీ నైతిక అధికారం లేదు.' అన్నాడు సుందరరావు.

'తమ హక్కును ధ్రువపరుచుకొంటున్న ప్రజలు అవరోధాన్ని సహించరు. దెబ్బకి దెబ్బ తీస్తారు. దౌర్జన్యాన్ని దౌర్జన్యంతో ప్రతిఘటిస్తారు'—అని హెచ్చరించేడు.

'ఇంతకాలం అర్జీలు, దరఖాస్తులూ అంటూ రివిజనిస్టులు బూర్జువా, భూస్వామి వర్గ కాంగ్రెస్ ప్రభుత్వ రథానికి ప్రజల్ని కాడెడు పశువులుగా చేసిపెట్టేరు. ఇంతకాలం జరిగిన మోసం

బలవంతుల దౌర్జన్యాలూ
ధనవంతుల పన్నాగాలూ
ఇంకానా? ఇకపై చెల్లవు!'
—అని ఎలుగెత్తి నినదించేడు.

ఒకదాని వెనక నొకటిగా ఈ వార్తలు వస్తూంటే రంగనాయకులు తన తండ్రి మొండితనానికి విస్తుపోయేడు.

'ఇంతకాలం పట్టిన ఓర్పు ఈ వేళ హఠాత్తుగా పోయిందే మీ నాన్నకి'—అంటూ మామగారు [illegible] ఎగతాళిగా పక పక నవ్వేడు.

'ఏమైనా యుగంధరుణ్ని చంపి వుచ్చేడయ్యా! ఆ భూమినుంచి 'స్క్వాటర్స్'ను తొలగించడానికి పోలీసు సాయం కోరితే ప్రభుత్వం—రివిజనిస్టులూ పిరికయ్యారని యాగీ వేయవచ్చు. ఎలాగా కొని భూమి ఉల్లాగూ వదిలెయ్య దలుచుకొన్నాం కదా—యాగీ ఎందుకు? ఏ మాలపల్లెవాళ్ళు అనుభవిస్తేనేం, వూరుకుందాం—అనుకొంటే సత్యానందం వాళ్ళూ నవ్వులపాలవుతారు. మరి పలకరించే వాళ్ళుండరు, కర తీస్తే...'

'మధ్యన పల్లెలవాళ్లు కొట్టుకు చావడమేగా ఈ యుగంధర్యం పర్యవసానం?'—అని సుశీల ఈసడించింది. ఆమె వరస చూస్తే రాత్రి తన్ను ఇంటికి తీసుకొచ్చినందుకే పశ్చాత్తాప పడుతున్నట్టనిపించింది.

రంగనాయకులు లేచేడు.

ఆ వ్యాఖ్యలో నిజం వుంది. తనకు తెలుసు తన తండ్రి ఆలోచనలన్నీ ఒకే దారిన పోతున్నాయి. ముందు తమ పార్టీని బలపరచుకోవాలి. దానికి ఇతరుల్ని ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలోని రెండో జట్టుకి నామరూపాలు లేకుండా చెయ్యాలి. ఆయన దృష్టిలో తక్షణ కర్తవ్యం అది. తన మామగారి వూహ నిజమే అయివుంటుంది. కాని దానిని తాము ఆపలేరు. మరేమిటి చెయ్యడం?

'క్లినిక్కు వస్తున్నావా?'

'మీరు వెళ్ళండి.'

రంగనాయకులు ఒక్క క్షణం ఆగేడు.

'నా మీద కోపం పెట్టు...'

సుశీల అర్థోక్తిలోనే కట్టె విరిచినట్టు సమాధానం చెప్పింది.

'మీ పార్టీకోసం కాదు నే వచ్చేది జనంకోసం. ఆ కుర్రాళ్ళూ, నేనూ సహాయ కార్యక్రమాలలోకి రావడం మీకోసం కాదు. అందుచేత మేము ఈ పూటనుంచి వెళ్ళమేమో అనుకోకండి. మీరు చూపినట్టు ఇంటెత్తు...'

రంగనాయకులు బాధపడ్డాడు.

'ఈ కుట్ర పనిలో నాకు వాటా లేదని, ఇందుకోసమే రాత్రి మీటింగుకి దూరంగా వుండలేదని నమ్మలేవూ?'

'మీ గత చరిత్ర ఆ విశ్వాసం కలగనీయడంలేద'ంది బండగా సుశీల.

'మీ వైరాగ్యం, రాజకీయాలకు దూరంగా వుంటాననడం ఆ వొంటెత్తుతనం మారు రూపాలేనని జ్ఞానం లేకపోయింది.'—అనేసింది కూడా.

రంగనాయకులికి అభిమానం అనిపించింది. సుశీల మొహం ముడుచుకొని వీడ్కోలు యిచ్చింది.

ఆమె మరల రమ్మనలేదని గమనించేడు. కుదుటపడిందనుకున్న తన జీవితం మళ్ళీ మొదటికొచ్చింది. దేశంలో ప్రజల జీవితం అల్లకల్లోలంగా వుండగా ఒక వ్యక్తికి సుఖ జీవితం వుండదన్న మాట గుర్తు వచ్చింది. 'ఎవరన్నదీ మాట'—అనుకుంటూ గుమ్మం దిగేడు, రంగనాయకులు.

* * *

వీధిలోకి వచ్చేక మామూలుగా ఇంటి వేపు అడుగు పెట్టేడు. కాని, మనస్సు ఎదురు తిరిగింది. అది తన తండ్రి ఇల్లు. రక్త బంధుత్వమే కాదు. రాజకీయ సమభావం కూడా ఆ ఇంటిని ఆత్మీయం చేసింది. ఇటీవల రాజకీయ భావాలు సందేహాస్పదం అవుతున్నకొద్దీ ఆ ఇంటికి రావడం. అక్కడ వుండడం కష్టంగానే వుంది.

ఈ వేళటి ఘటన రాజకీయ సమభావాన్ని పూర్తిగా చంపేసింది. తండ్రి అనుసరిస్తున్న ఈ మార్గం ఎక్కడికి తీసుకెడుతుంది ?

రంగనాయకులు నిలబడిపోయేడు. ఇంటికి వెళ్లాలనిపించలేదు. తిన్నగా క్లినిక్‌కు వెళ్లేడు. అది తాళం వేసివుంది. తాళం చెవికోసం ఇంటి కెళ్లాలి. లేకపోతే కంపౌండరు తెచ్చి తలుపు తెరిచేవరకూ కూర్చోవాలి.

వరండాలో రోగులకోసం వేసిన బల్లమీద కూర్చున్నాడు. రోడ్డున పోతున్నవారు ఆశ్చర్యంగా చూసేరు. ఒకరు అడిగేసేరు కూడా.

'ఏమిటి డాక్టరుగారూ, అల్లా వున్నారేమిటి ? అక్కడ కూర్చున్నారు, తాళం చెవి లేదా ?'

'కంపౌండరు వస్తున్నాడు'— అని అబద్ధమాడేడు. అప్పటికింకా ఏడు కూడా కాలేదు. కంపౌండరు ఎనిమిది దాటితే గాని రాడు.

ఎదుటింటి వెంకట్రామయ్య లోపలి నుంచే ఆ సమాధానం విని కుర్చీ తెచ్చి అరుగుమీద వేశాడు. ఆహ్వానించేడు.

'రండి. ఇల్లా కూర్చోండి డాక్టరు గారు. అక్కడ ఒక్కరూ కూర్చున్నారేమిటి ?'

ఇంక అక్కడ కూర్చోడం సాధ్యమనిపించలేదు. లేచేడు. నోటికి వచ్చిన అబద్ధం ఆడేడు.

'ఏం లేదు. హైస్కూలు కెళ్లి నలుగుర్ని వో మారు చూసి రావాలి. కంపౌండరుకి కబురు పంపేను. వస్తూంటాడు. రాగానే అల్లా పంపించండి' — అంటూ రోడ్డు మీదికి వచ్చేడు.

'వెళ్దురు గాని. కాస్త కాఫీ తీసుకెళ్లండి...' అంటూ వెంకట్రామయ మెట్లు దిగి వచ్చేడు. వస్తూనే తన గోడ





ప్రారంభించేడు:

'మీరు మొన్న ఇచ్చిన మందు పని చేసి నట్టే కనిపిస్తూంది. కడుపు వుబ్బరం...'

రోగాలుగురించి ఆలోచించే స్థితిలో లేదు మనస్సు. కాని, ఆమాట చెప్పలేకపోయేడు.

'తగ్గుతుంది. నాలుగు రోజులు మానకుండా తీసుకోండి. పథ్యం జాగ్రత్త—'

అంటూ ముందుకు నడిచేడు, రంగనాయకులు. 'వస్తా.'

వెంకట్రామయ్యని వదుల్చుకొన్నాక మరి అక్కడ నిలవ బుద్ధిపుట్టలేదు. హైస్కూలు మాట తోచాక వెళ్ళి జాన్‌తో మాట్లాడా లనిపించింది— 'అతడికి ఈ కుట్ర తెలిసి వుంటుంది ? తెలిసి కూడా రాత్రి సభలో పాల్గొని వుంటాడా ?'

కాని, జాన్ నిరగడని తేలింది.

'మీరు రాలేదు, నిన్నటి సభకి. అప్పటి కేమీ అనిపించలేదు. కాని, పొద్దున్న ఈ వార్త వినగానే అపనమ్మకం అనిపించింది, చెప్పొద్దూ.' అన్నాడు జాన్.

జాన్ నిరగడు. అతనికి సన్నిహితంగా వుండే నలుగురు, అయిదుగురు హరిజన పల్లెవాళ్ళూ నిరగరు. సుందరరావు పథకాన్ని వాళ్ళంతా ఇప్పుడు చిరచిర లాడుతున్నారు. జాన్‌లో నిప్పు వ జ్వాల చల్లారి పోయింది గ్గారు. ఆతనితో వుండడం ఆతనిని గౌర వించడంవలననే తమకు ఇళ్ళ స్థలా లు లేకుండా పోయాయి— అని వారి విచారం.

ఆ మాట వినగానే జాన్‌కు చిర్రు పుట్టింది.

'ఇప్పుడేమయింది ? వెళ్ళండి. మీరూ నో పాక వెయ్యండి. సాయంకాలం లోపున వీళ్ళకి మందెయ్యమని మళ్ళీ వద్దురుగాని.'

'మేమే అంత గాజులు తొడిగించు కున్నాం. మామీద చెయ్యేవడు వేస్తాడో రమ్మను. ఖైమా వండేస్తాం' అన్నాడు; శేషన్న బుస్సుమంటూ.

'ఆ వచ్చేవాళ్ళు నీచేత దెబ్బలుతినడానికి రారు. పోలీసులూ, తుపాకులూ బందో బస్తుతో వస్తారు. దెబ్బలు తిని బయటికి గెంటించుకోవాలంటే వెళ్ళండి' —అన్నాడు జాన్ పిరికి మందు పోస్తూ.

'పోలీసుల్ని తెప్పిస్తా రంటారా ?' — న్నాడు కాశయ్య అక్కడినుంచి జారు

కో. వెళ్ళకు'_ అని జాన్ దది

షేడు. కాశయ్య సలబడ్డాడు.

'ఆ అయిదెకరాలూ ఇళ్ళకోసం మనకి వదిలేస్తామన్నారు. ఇంటికి అయిదు సెంట్లు వుండాలనుకొన్నాం. పేర్లు తీసు కొంటే అందరికీ వచ్చేలా లేదు. నాలుగే అనుకొన్నాం. అందులో నీ పేరూ వుందా?' —అని జాన్ అడిగేడు.

'మా అన్నయ్య పేరు లేదు' అన్నాడు కాశయ్య.

'అతడికి వుంతలో వుందిగా.'

'అడూ, నేనూ ఒకే చోట వుండాలి' అన్నాడు మొండిగా కాశయ్య.

'మరి నిన్నొదిలి ఆ డెల్లి అక్కడ హద్దులు పెట్టుకొన్నాడేం ?'

కాశయ్య మాట్లాడలేదు.

'ఇల్లా జరుగుతుందని నీకు తెలును నన్నమాట' అన్నాడు జాన్, అనుమానంగా. ఉక్రోషంగా.

'నాకేం తెలియదు'— అని కాశయ్య నిర్లక్ష్యంగా విసురుకుపోయేడు.

అతడు వెళ్ళినవేపే చూస్తూ, జాన్—

## ఓం నమః శివాయః

కం. తవపాదసేవ భక్తితో
తాత్కాలిక నరజన్మమెత్తి తపించు
చుంటిన్
తిరిగి పుట్ట త్రిశూలా
తీర్థయాత్రలేల ఆశ్రితుడవు నీవుండ,

కం. తురిమెద పువ్వు పూబోణి
తూగుటుయ్యాలలో త్రూగితిలోకింతున్
తృణికరించకదయ్యా
త్రూష్ణీ భావములేదన్న దౌనాధిపతీ.

కం. తెగించ నీ ఆజ్ఞ లేనిది
తేట తెల్లముగ గమ్యమే గ్రహింపలేకుంటి
తైతక్కలాడ నేనన్న
తొడుగుకొనెద ధర్మ కవచం ధరించి
స్థాపించెద.

కం. తోడునీడై దరి జేర్చు
తౌ, ఔత్సుకముతో ముదంబొందెద
ముక్తేశ్వరా
తండవితండ విరుపాక్షా
తఃతః లాడించెదరు నరులు నరకయాతన
నల్.

రచయిత్రి: శ్రీమతి సరస్వతి గిరి

'ఈడికి తెలుసును' అన్నాడు.

మిగిలినవాళ్ళు అంగీకరించేరు.

'ఈ పని చెయ్యవలసి నప్పుడు చెయ్య లేదు. అవసరం లేని ఈ క్షణంలో చేశాం. పల్లెవాళ్ళమీది అభిమానమూ, మనకి పేరు రావాలనే దురహంకారమూ? గొప్ప తప్పు చేశాం. అన్యాయం...' అని రంగనాయకులు బాధ.

జాన్ తన మనస్సులోని అనుమానం బయట పెడుతూ రంగనాయకులు మాటకు అడ్డం వచ్చేడు.

'వీళ్ళని ఖాళీ చేయించడానికి సత్యానందం గారు పోలీసుల్ని తెస్తారేమో...'

'ఆశ్చర్యం ఏముంది? వాళ్ళకి మాత్రం ప్రతిష్ఠ అక్కర్లేదూ, ఈపాటికే ఆ పని చేసివుండకపోతే...'

ఆమే ఇవ్వడానికి సిద్ధమైన వస్తువును చేతిలోంచి లాగేసు లాక్కుంటే ఎవరికైనా కోపం వస్తుంది. కోపం వచ్చేక ఔచిత్యా నౌచిత్యాలు చూడదు. తనకు శక్తి వుంటే అదేదో తానే చూస్తాడు. లేకపోతే తోడు తెచ్చుకొంటాడు. ఆ ఆలోచనతోనే రంగ నాయకులు తక్షణం తాము ఏదో ఒకటి చెయ్యాలన్నారు.

'మన పార్టీకి మధ్య వున్న కక్షలో నాన్నగారు ఈ పని చేసేరు. ఇప్పుడు సత్యానందంగారు పోలీసు సహాయం కోరితే మనం ఆశ్చర్యపడ నక్కర్లేదు. జరిగేదదే. అది ఒకప్పుడు గవర్నమెంటు బంజరు అయినా ఒకరికి పట్టా అయిన భూమి అది. దానిని వారు పంచి పెడతా మను కొన్నారు గనక, మనం చేసిన పని తప్పే. మనం చేసిన ఈ పనితో వాళ్ళు మంది విన్న రాత్రి ప్రదేశం మార్చుకొని, అది తమవాళ్ళకే వ్వాలనే పునర్నిర్ణయానికి వచ్చినా రావచ్చు' అన్నాడు.

'తమ వాళ్ళకే అంటే' అన్నాడు శేషన్న.

'మీ నాన్నగారు మమ్మల్ని లెక్కేసుకో లేను. ఇప్పుడు ఆరూ మమ్మల్ని వొదిలేస్తా రంటారా? అని అతని మనస్తాపం.

ఆతని విచారంచూసి జాన్ వెక్కిరించేడు.

'ఈడు మీవాడే బాబూ! ఈడికీ నో నాలుగు సెంట్లు ఇమ్మని ఆరితో సెప్తాలే.'

'నువ్వే సెప్పాలి. ఆరు నీ మాట విన్నారు. పడం డెస్సే. మనమే అడు క్కుందాం.'

వాళ్ళిద్దరు ముగ్గురూ వెళ్ళిపోతూంటే. చూస్తూ రంగనాయకులు మందహాసం చేసేడు.

'మనకంటె రివిజనిపోళ్ళ మనస్సులూ, ఆలోచనలే ఆరోగ్యవంతంగా వున్నాయి డాక్టరుగారూ!' అన్నాడు జాన్. 'ఇప్పుడేం చేస్తాం.'

'అదే తోచడం లేదు ... ఈ పార్టీ తోనూ, పార్టీ కార్యక్రమంతోనూ సంబంధం లేదని ఖచ్చితంగా చెప్పి, బాడవ పొలం ఆక్రమణ తప్పు అని బహాటంగా రంగం లోకి దిగకపోతే మా నాన్నగారి పరువు తక్కదు. సౌందర్య పోలీసు లాకప్పులోకి, పతెల్లో కొట్టాటకి బలికాకుండా కాపాడడానికి ఒక్కటే మార్గం. మనం ఈ పద్ధతిని వ్యతిరేకించాలి. తప్పదు. నువ్వు రాకపోతే నే నొక్కడ్నే దిగి తీరుతా. పెళ్ళి పనులు ఆగదం, నుడిగుండంలోకి

# ఈ దారి ఎక్కడికి?

టంపేరు. చాలు!'

* * *

నిముషాలమీద బాడవ పొలంలోంచి మార్క్సిస్టు బెత్తాయింపు దార్నని వెళ్ళగొట్టేటందుకు ఏం చేద్దామంటూ కామేశ్వరరావు సైకిలుమీద హడావిడిగా వచ్చేడు.

బెత్తాయింపుదారు వట్టినే భూమి ఆక్రమించుకొని ఎళ్ళు వేస్తున్నారనే కన్న 'నక్సలైట్లు' ఉడిగా రిపోర్టు ఇస్తే త్వరగా పని జరుగుతుందేమో ఆలోచించమని సలహా పట్టుకు వచ్చేడు.

అప్పుడే సుందరరావును కలుసుకొని వచ్చిన సత్యానందం మనస్సు చింత మంట మండుతున్నా ఆ సలహాకు కటకటపడ్డాడు.

'నువ్వు కమ్యూనిస్టువి కూడా నువ్వు అంటున్న దేమిటో తెలుసా?'

'ఇంకా మెత్తమెత్తగా మాట్లాడతా రేమిటండీ. మీలాంటి నీళ్ళు నమిలే మన పార్టీ నీ దశకు తెచ్చారు.'—అని కామేశ్వరరావు చర్రు మన్నాడు.

సత్యానందానికి నవ్వొచ్చింది.

'ఏం చేద్దామంటావు స్పష్టంగా చెప్పు.'

'మీ గాంధేయ కమ్యూనిజం మనల్ని గంగలో దింపుతుంది. లేకపోతే మన పార్టీని బలపరచేటట్టుగా ఇళ్ళ స్థలాలను కేటాయించ నికి బదులు పార్టీ భేదాలతో నిమిత్తం లేకుండా ఇళ్ళులేని హరిజను లందరికీ అవి అడ్డం పెట్టేరు...'

ఇది నా మొదటి తప్పు జానకీ విన్నావా?' అన్నాడు సత్యానందం.

తన వాదాన్ని అంత తేలిగ్గా తీసుకొంటూంటే కామేశ్వరరావుకు కోపం చిక్కటమయింది.

'దేశంలో పోలరైజేషన్ వచ్చేసింది. మీరది గమనించకపోవడం ఆత్మ వినాశకరంగా పరిణమిస్తూంది......'

'బాగుందయ్యా, బాబూ! పోలరైజేషన్ వచ్చింది. సరే. ఎవరిమధ్య? నాకూ సుందరరావుకూ మధ్యనా? మార్క్సిస్టు — కమ్యూనిస్టు పార్టీల మధ్యనా? లేక ఈ రెండు పార్టీల వెనకా వున్న వాళ్ళ మధ్యనా? ఈ పోలరైజేషన్‌లో మన ఆత్మ నాశనంగాకుండా నేనేం చెయ్యాలనుంటుంది? వాళ్ళని నక్సలైట్ అని పోలీసు రిపోర్టు ఇవ్వాలి. వాళ్ళొచ్చి ఆ పోలరైజేషన్‌లో వినాశకరంగావున్న అంశాన్ని కోసి పారేస్తారు. కాదూ? ఇప్పుడు పోలీసులూ, మన యీ కాంగ్రెసు ప్రభుత్వ దానిని బలపరుస్తున్న బూర్జువా భూస్వాములూ ఈ పోలరైజేషన్‌లో ఒక అంశం అన్నమాట. చాల బాగుంది. అద్భుతంగా వుంది...'

సత్యానందం స్వరంలో గడిచిన కొద్ది హేళన బలపడుతూ అవహేళన విస్పష్టమయింది. చిట్టచివరకు వినువు, తేలికతనం విస్పష్టమయింది.

తన పోలరైజేషన్నూ, పోలీసు సహాయం కోరాలనడమూ మీద చేసిన వ్యాఖ్యవిని కామేశ్వరరావు విర్విణ్ణుడయ్యేడు.

'కామేశ్వరరావు, క్షమించు. తపాను ముందు మనం జరిపిన మీటింగులకి నువ్వు రాలేదు. నక్సలైట్ల గురించి మన అభిప్రాయాలేమిటో నీవు తెలుసుకన్నట్లు లేదు. పార్టీ వారిని తప్పుదారి తొక్కిన దేశభక్తులుగా, ప్రజాహితం కోరిన త్యాగమూర్తులుగా భావిస్తూంది. ప్రభుత్వం ప్రజాక్షేమం కొంచెంకూడా కూర్చలేక పోవడం, తత్ఫలితంగా యువతలో వచ్చిన నిస్పృహా, తెగింపూ వారిని సృష్టించాయి. పోలీసులూ, నిర్బంధాలూ వారిని అణచలేవు—అని మన వాదం. యువకులలో విధ్వంస దృష్టికి బదులు నిర్మాణ దృష్టి కలిగించడానికి మనకో కార్యక్రమం వుంది. పోలీసు సాయం కోరడం మాత్రం దానిలో భాగం కాదు...'

'ఇప్పుడేం చేస్తారు, మరి?' అన్నాడు కామేశ్వరరావు, తడిసిన పిల్లిలా ముడుచుకుపోతూ.

'అదే ఆలోచిద్దాం. కూర్చోండి' అంది జానకి.

సుందరరావుతో జరిగిన సంభాషణను సత్యానందం సూక్ష్మంగా చెప్పాక కామేశ్వరరావు మళ్ళీ అడిగిన ప్రశ్న 'ఏం చేద్దామంటారు?' అనే.

'నువ్వు మళ్ళీ అదే ప్రశ్న అడుగుతావనుకోలేదు' అన్నాడు సత్యానందం.

ఏమడగాలనుకొన్నాడో కామేశ్వరరావుకి అర్థం కాలేదు. తెల్లబోయేడు.

'పాకలు వేసినవాళ్లు ఏందరు ? వివ రేవరు ?—అనే ప్రశ్న వేస్తా వనుకొన్నా...'

గత రాత్రి నూరుమందికి స్థలాలు చూప గల మనుకొన్నారు. సుందరరావు పిలుపుకు వచ్చినవారు ముప్పయిమంది. వాళ్ళలో ఒక పాతికమందికి తామూ స్థలం కేటాయించిన వారే. అయిదుగురు పైనవాళ్ళ వాళ్ళు... ఇద్దరికి వూరితలో స్థలాలున్నాయి.

'పొలం అంతా జనమే కనిపిస్తున్నారు. ముప్పయిమంది పైచిల్లరేనా?' అన్నాడు ఆశ్చర్యంగా, కామేశ్వరరావు.

'భూమిలో బైతాయించారని పోలీసు రిపోర్టు ఇద్దామన్నావే. ఆ బైతాయింపు దారులలో ఏ నలుగురైదుగురో తప్ప మిగతా అంతా, మనం బైతాయించమందా మను కొన్నవాళ్లే.'

'మిగతా భూమి అల్లాగే ఉందన్నమాట'

'లేదు. జోగన్నకి పాకా, పాక చుట్టూ ఉన్న రెండెకరాలు పైగా చెలకా ఆక్రమించు వారు. అది ఆతడిదీ—అదే అనుకొన్నా.'

'అయి వుంటుంది. అబ్బాయితో నిన్న జోగన్న అల్లాంటిదే ఏదో చెప్పేడట. మీ తాతగారు, ఆ పొలం చూసినందుకు సగం నాకిస్తానన్నారు—అన్నాడుట.'

'నాతో మాటాడినప్పుడు అంతా తనకే ఇస్తానన్నారన్నాడులే' అన్నాడు సత్యానందం.

'ఇప్పుడేం చేస్తారు?'

కామేశ్వరరావుది మళ్ళీ అదే ప్రశ్న.

'ఏం చేస్తా'రనిగాక 'ఏం చేద్దా'మను కుంటే మంచిదికాదూ?' అని సత్యానందం మరోచురక తగిలించేడు.

కామేశ్వరరావు నిరుత్తరుడయ్యేడు.

'పోనీ ఏం చేశావని అడుగు' సోమ రసేంద్రను వెంటబెట్టుకొని బాడవ పొలం వెళ్లేను. మాలిను లోపన్న వాళ్లం దరికీ పాకలు వేసుకోమని చెప్పివచ్చాం'

'మీరు చెప్పేదేమిటి వాళ్లే వేసేసు కొంటున్నారుగా...' అన్నాడు కామేశ్వ రావు.

'అంతే కాదుగా! వాళ్ళు వేసుకొన్నట్టు మనకు దాఖలా కావాలి. కనక మధ్యాహ్నం 3 గంటలకు పోలీసు స్టేషనుకి వచ్చి, జాన్‌కు చెప్పాలి. అతడు రశీదు ఇస్తాడు. అల్లా ఇవ్వకపోతే, అతడు స్థలం ఆక్రమణ చేసినట్టు లెక్కగట్టి, తీసుకోవలసిన చర్యలు తీసుకొంటాం...'

'అంటే?...'

'అవసరమైన చర్యలు...'

'పోలీసుకు...

'మీకు పోలీసురంధి పట్టుకొందే'

'మరి...'

'స్థలాలు ఇవ్వాలనుకున్న వాళ్లు ఇంకా డెబ్బయిమందివరకూ వున్నారు. మనకి తన రాకగురించి చెప్పి, చీటి తీసుకోని వాళ్ళకి స్థలం వుండదు. అది మరొకరి కిచ్చేస్తాం.'

'వాళ్లల్లో వాళ్ళు కొట్టుకొంటారేమో' —అన్నాడు కామేశ్వరరావు.

'పోలీసు వాళ్లేగాని మనవాళ్ళకి కొట్టే అధికారం, దెబ్బలుతినే అధికారం లేదా?'

'పాకవేసిన వాడు కదలకపోతే...'

'చూద్దాం వానికి ఇతరత్రా స్థలం లేకపోతే ఇద్దాం. తప్పేముంది? సుందర రావుగారు ఏవో చిక్కులు తెచ్చేరు. దానికి మనం బెదిరిపోవడం అర్థంలేదు. కొంచెం ఓర్పూ, ఆలోచనా చూపుతే...'

'మంచిపని చేసేవు'— అంటూ జావకి లేచింది.

* * *

సాయంకాలం అయ్యేసరికి సుందరరావు వాడిపోయానను కొన్నాడు.

కొడుకు—తనమీద అంతభక్తి, విశ్వాసాలుగల కొడుకు — ఈ ఇరవయ్యేళ్ళూ తననే అంటి పెట్టుకొనివున్న జాన్—



—ఇద్దరూ బహిరంగంగా తన చర్యను దుయ్యబట్టినా సుందరరావు జంకలేదు.

పెద్ద రాజకీయపుయెత్తులో తను పరమ శత్రువైన 'రివిజనిస్టు' పార్టీని నేల కరిపించేశానను కొన్నాడు.

'పోలీసుల్ని తెచ్చేరా వీళ్ళపార్టీకి జనంలో పుట్టగతు లుండకుండా పోతాయి. వూరు కున్నారా హరిజనపల్లెల్ని వదులుకో వలసిందే...అప్పుడే భూదానం — ఇప్పుడే గోదానం. భేషుగ్గా కుదిరింది. తమ్ముకు చావనీ' అనుకున్నాడు.

కాని మధ్యాహ్నం అయ్యేసరికి రంగు మారింది. జోగన్నకి వదిలిన రెండెకరాల చిల్లరలో సత్యానందం జనాన్ని ప్రవేశపెట్టేడు.

గ్రామంలో కమ్యూనిస్టు పార్టీ సభ్యు లంతా, సానుభూతిపరులంతా హరిజనపేటం వారితో పెద్ద వూరేగింపుగా వచ్చారు. అడ్డం వచ్చిన జోగన్నను ఆడ్చేశారు. తాత్కాలికమైన హద్దులు పెట్టి పేరు పేరున ఇచ్చేశారు. ఆ భూమి పంపకం ఉద్య మంలో

—రెండోభాగంగా తాను ప్రవేశపెట్టిన వారికి స్థల నిర్దేశం ప్రారంభించేరు.

ఆ జనాన్నీ వారి ఉత్సాహాన్నీ చూపేసరికి తాను తెచ్చినవాళ్ళ నీళ్ళు కారిపోయేరు. వాళ్ళ ధైర్యం నిలవడానికి తాను చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఒక్కొక్కళ్ళే జాన్ దగ్గరకు కదులుతున్నారు.

ఒకరు—ఇద్దరు —నలుగురు— అయిదు గురు...

'చెరువుకు గండి పడింది' అన్నాడు సత్యానందం కొడుకు రామకృష్ణ నవ్వుతూ.

'నిజమే. గండి పడింది. దానిని పూడ్చ గల శక్తి తనకు లేదు. నిన్న పొద్దుటి నుంచి పడుతున్న శ్రమతో తల తిరిగి పోతూంది.

ఇంక అక్కడ అనవసరం తానుండడం. వెనుతిరిగేడు. కాని, రెండడుగులు కూడా వెయ్యకుండానే పడిపోయాడు.

స్మృతి తప్పుతున్న స్థితిలో ఎవరో తన పేరు పలుకుతున్నారు.

'సుందర...'

తరవాత ఏం తెలియదు...

నిస్సహాయ స్థితిలో ఉన్న తన్ను చేతుల మీద ఇంటికి చేర్చేరు. ఇద్దరు డాక్ట కష్టపడి తన్ను బతికించేరు...

కాని, కాలూ చెయ్యీ

# ఉప్పుతో తొమ్మిది



బులుసు వేంకటరమణయ్య — ధర్మపథం

ఏదయినా ప్రదేశం సుభిక్షంగానూ, సర్వ శుభసాయాలతోనూ ఉండి సుఖప్రదంగా ఉన్నాదంటే—అది ధనధాన్య సమృద్ధమై ఉన్నదనీ, అక్కడ 'ఉప్పుతో తొమ్మిది' వుండి ఏ లోపమూ లేకుండా ఉంటుందనీ చెప్పుకోవడం పరిపాటి. ఉప్పుతో తొమ్మిది—అని అనుకుంటారే గాని ఆ తొమ్మిదీ ఏమిటో—వాటి ప్రయోజనం ఏమిటో తెలిసినవారు తక్కువ.

● తొమ్మిదీ ఏమిటంటే—

'ఘటం పటం జలం కాష్ఠం
తండులం తైలమేవచ,
శాక మన్ని సమాయుక్తం
లవణం నవమం విదుః'

కుండ, వస్త్రం, నీరు, వంటచెరకు, బియ్యం, నూనె, కూర, నిప్పు, ఉప్పు— అవేవే ఆ తొమ్మిది. అన్నింటికీ చివర ఉప్పు వస్తుంది.

మానవుల సామాన్య జీవితానికి ఇవి ఎంతో అవసరం.

మానవుడు మృగప్రాయుడుగా ఉండకుండా తన మానాన్ని కాపాడుకొనుటకు వస్త్రాన్ని ధరించడం అవసరం. అందువల్ల అన్నింటికన్నా ముఖ్యమైది.

ప్రతివారు జీవించడానికి అన్నం అవసరం. 'అన్నాత్పుర్షమాని భూతాని జాయంతే, అన్నేన జాతాని జీవంతి' అని శ్రుతులలోనే చెప్పబడి ఉన్నది, ఆ అన్నం తండులాల వల్లనే తయారవుతుంది. అందువల్ల బియ్యం ఆహార పదార్థాలలో ముఖ్యమైనది.

బియ్యం మూటకట్టి తెచ్చి పడవేస్తే అన్నం తయారు అవుతుందా! ఆ బియ్యాన్ని ఒక పాత్రలో వెయ్యాలి. అంటే అధను పక్షం కుండ అయినా కావాలి. ఆ బియ్యం ఉడకడానికి అందులో నీరు పొయ్యాలి. కాబట్టి నీరుకూడా ముఖ్యమే! మానవ జీవితానికి నీరు ఎంతో ముఖ్యం. ఆహారం కంటెనూ దాని అవసరం ఎక్కువ.

అన్నం ఉడకడానికి కట్టెలు, కట్టెలు మండించడానికి అగ్ని అవసరమైనవే!

ఈవిధంగా తయారైన అన్నాన్ని ఆధరువు లేకుండా తినలేము. అందుకోసం శాకం కావాలి. దాన్ని తైలంలో పక్వం చేస్తేనేగాని రుచిగా వుండదు.

ఎంత రుచిగా వండినా అందులో ఉప్పు వెయ్యకపోతే ప్రయోజనం లేదు. షడ్రసాలలోనూ ఉప్పే ప్రధానమైనది.

మన అతి సామాన్య జీవితావసరాలను అనుసరించే మనవారు 'ఉప్పుతో తొమ్మిది' అవసరమైనవని ఏర్పరచారు. ●

# ఈ దారి ఎక్కడికి?

లేదు. కళ్ళు వున్నాయి. తెలివి వుంది. చెవులు వినిపిస్తాయి.

తానొక జీవచ్ఛవం!

తానేమీ చెయ్యలేదు!

తన ఈ స్థితికి కారకులే తనకు మందులిచ్చి బ్రతికిస్తున్నారు చూసుకో నిన్ను ఏ స్థితికి తెచ్చామో అని వెక్కిరించడానికే తన్ను బ్రతికిస్తున్నారనిపించింది.

మాలపల్లెలు వరసన తన్ను చూడడానికి వస్తున్నారు. గ్రామంలో జనం వస్తున్నారు. పైవూళ్ళ వాళ్ళు వస్తున్నారు.

వారందరూ రావడం తనమీద ప్రజలకు గల అభిమానానికి చిహ్నం అంటూంటే మనస్సు రగిలిపోతూంది.

'అబద్ధం వీళ్ళు ద్రోహులు. విప్లవ ద్రోహులు, వీళ్ళెవరూ నామీద ప్రేమతో రాలేదు. విప్లవాన్ని పూర్తిగా చంపేమో లేదో చూసుకొనేందుకు వస్తున్నారు.'— అని అరవాలనుంది. కాని నోరులేదు. తన అశక్తతకు కన్నీళ్ళు కారేయి. ఆ కన్నీళ్ళు చూసి చేసిన వ్యాఖ్య మరీ హింసించింది.

'మీకేం చెయ్యలేకపోయేను అశక్తుడినై పోయానని కన్నీరు పెట్టుకుంటున్నారు.' అంటున్నారు.

'లేదు మీ పీక పిసికెయ్యాల నుంది. మీరంతా చస్తేగాని, మీ చితాభస్మంమీద గాని భావిసుఖ మందిరం నిర్మించబడదని నిలుగెత్తి చెప్పాలనుంది.

సత్యానందం జానకి ఆ కుర్రాడు ఆమె కొడుకు వీళ్ళంతా శత్రువులు. విప్లవానికి శత్రులు, వర్గశత్రువులు ...'

సుందరరావుకి మరల స్పృహ తప్పింది.

మళ్ళీ స్ట్రోక్ వచ్చిందని రంగనాయకులు కంగారు పడ్డాడు

ఈమారు సుందరరావుకి మరల తెలివి రాలేదు. ఆ మెదడు నరాలు రాగద్వేషాలను ప్రకటించలేవు. శత్రు—మిత్రుల్ని వేర్పరించలేవు

రంగనాయకులు బావురు మన్నాడు.

'ఈదారి ఎక్కడికి అఖరయిందా?' ●

(అయిపోయింది)



# ఫాక్టమ్‌ఫాస్‌తో పండిన ద్రాక్షపళ్ళు ఎన్నడూ పుల్లగా వుండవు

అంతేగాదు. వీర్యవంతమైన, బరువైన, కండగల్గిన, పళ్ళు గుత్తులలో కాస్తాయి. మీ ద్రాక్ష తోటలకు సంకీర్ణ ఎరువు ఫాక్టమ్‌ఫాస్ వాడి, సబలమైన, ఆరోగ్య వంతమైన, క్రిమికీటక బాధల నిరోధించగల ద్రాక్ష గుత్తులను ఎల్లప్పుడూ పండించండి.




సిఫారసు చేయబడిన రసాయన ఎరువుల మోతాదులు. కిలోగ్రాములలో

| | ఫాక్టమ్ ఫాస్ | సల్ఫేట్ ఆఫ్ పొటాష్ | యూరియా | సూపర్ ఫాస్ఫేట్ |
|---|---|---|---|---|
| ఒక్కొక్క ద్రాక్ష తీగకు— | 16 - 20 | | | |
| (రెండు కత్తిరింపులకు) | 5 | 4 | 1 | 2 |

ఫాక్ట్ కర్షక బంధు

## ది ఫర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ ట్రావెన్‌కూర్ లిమిటెడ్.
## ఉద్యోగమండల్ - కేరళ

ఆంధ్రప్రదేశ్ ఏరియా ఆఫీసు: 5—4—5 & 6, పదంవిల్లా, జవహర్‌లాల్ నెహ్రూ రోడ్ అబిద్ సర్కిల్. హైదరాబాద్—1. (ఏ.పి.)

ప్రాంతీయ కార్యాలయాలు: నిజామాబాద్, వరంగల్, హైదరాబాద్, నెల్లూరు.

aries EKM. FT 154L 5T




వానకురిస్తే, ఒక్కవాన అదునుకు కురిస్తే—ఆశనిండిన కళ్ళతో, ఆకాశంలో కదులుతున్న మబ్బుల్ని చూస్తూ అనుకున్నాడు పాపయ్య. వానకురిస్తే, మిరపకు పులక అవసరం ఉండదు. సెనక్కాయ విత్తవచ్చు — సేద్యాలయినాయి, నిమ్మచెట్లకు నీళ్ళపారకం బాధ తప్పుతుంది తొమ్మిదిమట్లు తెగినా ఒక అరెకరం కూడా పారకానికి రాని నీళ్ళున్న బావిని చూస్తూ, గాలికి గిలగిల లాడుతున్న మిరప నారు మొక్కల్ని చూస్తూ, భవిష్యత్తు చెప్పని నిమ్మచెట్లను చూస్తూ పాపయ్య ఆశగా అనుకొన్నాడు: వానకురుస్తే.

అవును ఏడైనా వానలు అదునుకు బాగాపడితే, ఎకరం మిరపచెట్లు దండిగా కాస్తే ధరలు పలికితే, మూడెకరాల్లోని సెనక్కాయ బాగా పండితే - తోటోని పైపైరువల్ల నాలుగైదు వేలు చేతికొస్తుంది. ఈసారి చెటను కాపుకు వదిలితే, వానలువచ్చి బావిలో నీళ్ళొస్తే, నిమ్మచెట్లమీద తొలికాపుకే హీనంగా రెండువేలు చేతికి రాల్తుంది. వెలి[illegible] పైరంతా ఖర్చులకుపోనీ. ఏడెకరాల్లో జొన్న, పదహారెకరాల్లో తీగసెనక్కాయ, పత్తి. ఈఏడు పగానికి పైగా బాకీలు తీరతాయి. తప్పక తీరతాయి. బాకీలకన్నా దరిద్రమూ లేదు, నరకమూ లేదు, బాకీలున్న ఏ కుటుంబమూ ఈ రోజుల్లో ముందుకు రాదు. బాకీలున్న మనిషి మనిషి కాదు. తానేం మనిషి? తనకూ, తన కుటుంబానికీ ఒకప్పుడున్న గౌరవం ఈనాడుందా? చుట్టపట్టాల్లో, బంధువుల్లో ఒకప్పుడున్న మర్యాద ఇప్పుడుందా? ఈనాడు గౌరవం మర్యాదా ఎక్కడున్నాయి? వాళ్ళందరూ నీదగ్గర డబ్బుల్లేవు కాబట్టి, నీకాస్తి తరిగిపోయింది కాబట్టి, నీకు బాకీలున్నాయి కాబట్టి నిన్ను గౌరవించడంలేదు అని ముఖంమీద అనరు. కాని వెనక అనేక రకాల మాటలంటారు, అవమానిస్తారు, హింసిస్తారు. అందుకే తాను డబ్బు సంపాదించాలనుకొన్నాడు. ఆశకొద్దీ అప్పు చేసి బావి తవ్వించాడు. నమ్మకం కొద్దీ నిమ్మచెట్లు వేసినాడు. కాని ఆశ చెడ్డది. ఆశ అన్యాయం చేస్తోంది. నమ్మకం చెడ్డది. నమ్మకం ముంచుతోంది. వానల్లేవు. అన్ని బావుల్లో మాదిరే ఈ బావిలోనూ నీళ్ళు లోతుకు, ఇంకా లోతుకు పోతున్నాయి. ఎక్కడికి పోతున్నాయో? నిమ్మచెట్లు కాస్తే చేసిన అప్పులు ఒక లెఖ్ఖ కాదు. తన ఆశా, నమ్మకమూ నెరవేరే విషయం ఏమో కాని 'అప్పుల దయ్యం' తన్ను పట్టుకొంది. తన వంశంలో ఏదో పద్ధతిలో, ఏదో కారణానికి, ఏదో దశలో అప్పులు 'చేయందెవరు? అవును చేయక తప్పేదేముంది? మెట్టనమ్ముకొన్న వాళ్ళు ఎవళ్ళూ బాగుపడరు. ఎప్పుడూ బాగుపడరు. వానలు అదును వస్తే బాగు పడతారు. పాపయ్య బాధగా ఆలోచిస్తున్నాడు.

'నిమ్మ చెట్లేసి ఎన్నాళ్ళయింది?' ఆ దోవన పక్కూరికి పోతున్న ఒకరెవరో అడిగారు. ఆ ప్రశ్నతో పాపయ్య లోకంలో పడినాడు.

'ఆరు ఏళ్ళయింది.'

కాపుకు విడిచినారా? బూమి బ్రహ్మాండమైన బూమి. చెటకు బాగా లాయికీ

[illegible]

అయ్యాడు. ఇంతకూ చెప్పనేలేదు నీటి పారకం తక్కువైనట్లుందే. ఏం? బావిలో నీళ్ళు తక్కువ వస్తున్నాయా?' మళ్ళీ ప్రశ్నించినాడు.

పెద్దకు భూమి లాయక్ అయిందన్న దాన్ని ఎంతో ఉత్సాహంగా తన పథకాలను అన్నీ చెప్పాలనుకొన్న పాపయ్య నీళ్ళ సంగతి వచ్చేవేళకు నీళ్ళుగారిపోయి ఆ అని ముక్తసరిగా సమాధానించినాడు. దారిన పోతూన్న వాళ్ళంతా బావిదగ్గరకు వచ్చి నిలబడినారు. ఇంకా ప్రశ్నించిన పెద్దమనిషే తన ధోరణిలో చెప్పుకొని పోయినాడు: 'ఊహూ లాభం లేదు. ఈ వానలు సరిగ్గా

# వానకురుస్తే

కురవని కాలంలో నిమ్మచెట్లు పెట్టుకోవడం దండగ. ఒట్టి బుద్ధితక్కువ. మా ఊళ్ళో ఒకప్పుడందరూ చీనిచెట్లమీద ఎగబడినవాళ్ళే, నీళ్ళు చాలక చెట్లు కొట్టేసుకుంటున్నారు. ఒక్క బావికే ఇరవై వేలు కర్చుపెట్టిన వాళ్ళున్నారు. ఏం లాభం. వింటున్నావా?' పాపయ్యకు అతనితో మాటల్లో దిగడం ఇష్టంలేదు. వాళ్ళకు దూరంగా తోటలోకి నడిచినాడు. ఆ పెద్దమనిషి పక్కన్నవాళ్ళతో తోటల్ని గురించీ, బావుల్ని గురించీ ఇంకా మాట్లాడుతూనే కదలిపోయినాడు. పీడ వదిలింది. అవి పాపయ్యకు ఇష్టంలేని మాటలు. మనసుకు కష్టం కలిగించే మాటలు. వాణ్ని చంపాలన్నంతకోపం వచ్చింది. లేకపోతే, లేకపోతే వాడేం మొనగాడా? నీళ్ళెక్కడబడేది తెలిసిన శాస్త్రగాడా? తనకన్నీ తెలిసుకున్నాడా? తానిదంతా ఆలోచించలేదనుకున్నాడా? అదే పనిగా స్వామివార్ని పిలిపించి అగ్నంపెట్టి చేతో ఇటువైపు ఈ గజ్జన ... తవ్విస్తే ఆ వేధన లాభం లేదంటాడా? తన బావి సంగతి వాడికేం తెలుసు? పాపయ్యకు చిరాకూ, కోపం కలిగినాయి. ఒక చోట పడిపోయిన గోడమీద కంపను తొలగించుకొంటూ తోటలోకి ఆ సమయంలో దొంగగా రావాలనుకుంటున్న దున్నపోతు మీద ఓ పెంకో, రాయో విసిరి కసి తీర్చుకొన్నాడు.

వాడు చెప్పిందీ నిజమేనేమో! అయినా తొమ్మిది మట్లు దిగితే నీళ్ళు సరిగ్గా వస్తాయంటే ఇంకెక్కడ పడతాయి. స్వామివారితో ఈ విషయమే అంటే అయ్యన్నారు: నవ్వుకుంటూ పడతాయి. దేవికూడా అదే చెప్పింది. పైగా నేను అగ్నం పెట్టిన వేళావిశేషం అట్లాంటిది. తూర్పు దిక్కున ఆ చిన్న వూట వుందే అటువైపు బోరింగు వేయించు. బుగ్గ పుట్టాల. నీళ్ళు లోపలనుంచి ఎగదన్నకపోతే, జల ఉబక్కపోతే నన్నడుగు. పదొప్పవరు ఇంజను రెండు పెట్టించి బొంగులో కొట్టినా తరగవు మాడు. పిరారెడ్డి బావిలో నేను నీళ్ళు పడతాయని చెప్పితే పలేదా? వాక్కు తప్పదు పాపయ్యా. నిజమేనేమో. లేకపోతే నా ఖర్మేమో. బోరింగు వేయించాల. లోపల నట్టువుందో, బండవుందో. స్వామివారి వాక్కుబలం. బోరింగు వేయించాల. కనీసం నలభై, యాభై అడుగులు దించాలి. కానీ డబ్బు. డబ్బు ఎక్కణ్ణుంచి తేవడం? పాతప్పులే తీర్చడానికి భయంగా వుందే. కొత్తప్పుల్ని తేవడమెట్లా? తీర్చడమెట్లా? తేవడం, తీర్చడం, తేవడం బతుకంతేనా?

వానలు దండిగాపడితే ఈ బాధలుండవు. ఈ భయాలుండవు. వానలు కురిస్తే బావికి నీళ్ళెక్కుతాయి; బావిలో నీళ్ళెక్కితే నిమ్మచెట్లు ఒక్కకాపుకు విరిగి కొడతాయి; పైర్లు బాగా పండతాయి. అప్పాంటప్పుడు

మొగవానికి ఒక వరహా దువేల అప్పు లెఖ్ఖా వ్రతమా ? వడ్డీతోసహా నీతికి నిజాయితీకి కట్టుబడి బాకీల్ని తీర్చే గుణం తమ వంశ రక్తంలోనే వ్యాం పాపయ్య వంశ గక్కం గర్వంతో కులికింది. తన అబ్బ అణాపైసలో అప్పు తీర్చినాడు — అప్పి అమ్మి తీరిపోతేనంగాక! తన తండ్రి చచ్చిపోతూ ఋణం ఉంచుకోకూడదు— అందులోనూ బంధువుల దగ్గర అంటే తాను కమాషికి వచ్చిన మొదట్లో పదేకరాలు అమ్మి వడ్డీతోసహా ఋణం తీర్చినాడు. ఇంత నిక్కచ్చిగా బాకీలు తీర్చేవాళ్ళు ఈ

# వానకురుస్తే

రోజుల్లో లేరు. అదే మరొకళ్లయితేనా! ఆస్తులు వివళ్లో ఒకళ్ళ పేరబెట్టుకొని సొమ్ము వెనకేసుకొని దొంగ బాండ్లని పుట్టించి 'ఐపీ' పెట్టి సంపాదించుకుండేవాళ్ళు. నీతికీ అభిమానానికీ కట్టుబడకుండా డబ్బు సంపాదన ఎందుకు? డబ్బు లేకపోతేనేంగాక ఆస్తి తగ్గిపోతేనేంగాక తన కుటుంబానికి పరువుంది; ప్రతిష్ఠ వుంది. పరువు ప్రతిష్ఠ లేనివాళ్ల దగ్గర ఎంత డబ్బుంటేనేం! అంగడి రామిరెడ్డికి కావల్సినంత డబ్బుంది. దొంగసారాయమ్మి, దొంగ వట్టేటమ్మి, నానా దొంగ గడ్డి తిని మిగిలించిన డబ్బుంది. ముచ్చొడ్డీలకిచ్చి సంపాదించిన డబ్బుంది. కొంపలు కూల్చిన డబ్బుంది. ఈ రోజుల్లో ఎంత నీతిని విడిస్తే, ఎంత సిగ్గును విడిస్తే, ఎంత ధర్మను మోసగిస్తే అంత డబ్బు సంపాదించవచ్చు. రామిరెడ్డి — అతని డబ్బూ, అతని సంపాదనా స్మృతిలో మెదిలేసరికి పాపయ్య మనస్సు అసహ్యంతో నిండిపోయింది. వాడిదగ్గర వెయ్యిరూపాయలు వీల్లేక, ఇబ్బందులకు తట్టుకోలేక వడ్డీకి తెచ్చినాడు. ముచ్చొడ్డీకి నూటి కయిదురూపాయలకు. ఎవరికీ తెలీకుండా — కట్టుకడపటకు కడుపున పుట్టిన కొడుక్కు, పెద్దకొడుక్కు తెలీకుండా తెచ్చినాడు. అప్పులు చెయ్యకుండా బ్రతకడం అసాధ్యమైపోతోంది. ఏవో ఖర్చులు తగులుతున్నాయి. పెళ్ళిళ్ళ ఖర్చులు, ఇంటిఖర్చులు చదువుల ఖర్చులు, రోగాల ఖర్చులు. వానలేక ఖర్చులు — ఖర్చులు, బాకీలు' కానీ ఇట్లాంటి బాకీలు. రామిరెడ్డి దగ్గర తెచ్చిన్నాంటి బాకీలు పగవాడు కూడా చేయకూడదు. వాడు ప్రతినెలా వడ్డీ తీసుకొంటూనే వాయిదామాత్రం సంవత్సరం పెట్టినాడు. ఇంక మూన్నెళ్ళు — మూన్నెళకు వాయిదా ముగుస్తుంది. వానకురుస్తే మిరపకాయలు తొలికోత తెగేసరికి వాడి డబ్బు వాడిమొకాన కొట్టాలి. లేకపోతే వాడు గుంటనక్క. ఇట్లాంటి వాళ్ళదగ్గర అప్పులు చేయకూడదు. పాపయ్యలో ధైర్యం ఆవరించింది.

ఆకాశంలో చెడుగుడు ఆడుతున్న మబ్బులు, విడిపోతున్న మబ్బులు, కలుస్తున్న మబ్బులు. గాలి. సగానికం పట్టి పట్టు వీచేగాలి. ఉరుము ఉరుము అర్జునా అర్జునా, మెరుపు, మెరుపు కళ్ళను చెదరగొడుతున్న మెరుపు. చినుకులు చినుకుల చిటపట. పాపయ్య హృదయం ఆనందంతో పులకించింది. చినుకులు, పెద్ద చినుకులే. తప్పకుండా ఈ వాళ పెద్ద వానే పడుతుంది. మిరపచెట్లకు పులక, సెనక్కాయ విత్తనం, బావిలో నీళ్ళు, నిమ్మచెట్ల పొదుల్నిండా నీళ్ళు. ఈ కార్తెలోనే పెద్ద వానలు పడతాయని పంచాంగంలో ఉంది. ఈ కార్తె నిన్న మొదలైంది. పంచాంగం తప్పదు. వాన కురవడం తప్పదు.

గబగబా నెత్తిమీద వల్లెవేసుకొని పాపయ్య ఇంటిముఖం పట్టినాడు. చిక్కనవుతున్న గాలివిసురు. ముసురుకొస్తున్న చీకటి. విసిరికొడుతున్న గాలి. ముఖంపైద చురుక్కుమనే చినుకులు. అంతంత మాత్రం చూపులున్న పాపయ్య, తన శరీర యజ్ఞఫలాన్ని పితృఋణ గృహబంధు దేవతలకు అర్పించిన పాపయ్య, తొందరపాటులో ఒక చేనిగట్టు తగిలి కిందపడినాడు. పాపయ్య దీనంగా మూలిగి, రెండుచేతులతో మోకాలి చిప్పల్ని ఒగడన్ని మెల్లగా లేచినాడు. గుండెదడ మొదలైంది. మళ్ళీ వస్తుందా? గుండెపోటేమైనా మళ్ళీ వస్తుందా? వాన కురుస్తే చాలు. మళ్ళీ రానీ, తాను చస్తేనేం, బాకీలు తీరకుండా చావకూడదు. సంసారాన్ని తలెత్తుకొనేట్టు చేసి మరీ చావాలి. ఫీ పాడు ఆలోచన. వానమీద ఈ గాలికెందుకు కసి? కానీ (వానవస్తుంది. వస్తోంది. పాపయ్యకు అవ్యక్తమైన భయమూ, ఆనందమూ కలిగినాయి. ఆలోచనలతోనే ఊరు చేరుకొని నిట్టూర్చినాడు. పంచాయితీ ఆఫీసులో రేడియో వినాలి. ఈ దినం వాన కురుస్తుందని పెద్ద గాలీవానా వస్తాయని రేడియోవాళ్ళు తప్పక చెప్తారు. పాపయ్య పంచాయతీ ఆఫీసు ప్రవేశించినాడు. అక్కడ రాజకీయాలు ఒకళ్ళ కొంపల్ని ఒకళ్ళు తీసుకొనే రాజకీయాలు. మంచివీ, చెడ్డవీ అన్నిరకాలవీ రాజకీయాలు.

'ఏం మామా తోటకామ్పుంచేనా?' సుంద రెడ్డి అడిగినాడు.

'ఇం ఈవాళ పెద్ద వానేరావచ్చు వార్తల్లో ఏం చెప్పేరాయా?' సందేహ ధావ

వానొస్తే దేవతలెందుకయ్యా! ఈ పాటికి మనమిట్లా వుండేవాళ్ళం గా చెప్పు' కరణం అందుకొన్నాడు కరణానికే దొబ్బులాగులా మనమంటాడు. మధ్యలో తనకేమైంది. వచ్చేవాళ్ళు తనలాంటి వాళ్ళు కానీ. నక్కలా ఐతుకుతున్నాడు. పాపయ్య లోలోన ఉడుకుతున్నాడు.

'కలికాలం. బ్రహ్మంగారు చెప్పినట్లు ఇప్పుడు రాజ్యం ఏలుతున్న దెవరు?' కరణం మళ్ళీ ప్రారంభించినారు.

'ఇప్పుడీ తత్వాల్తో ఏంగానీ ఈ పది రోజులూ బజన్లూ, పానక పంపేరం

# వానకురుస్తే

ఏర్పాటుచేస్తే బాగుండదా? పాపయ్యమామ బాగోతం చదువుతాడు ఏమంటావు మామా?' సుందరరెడ్డి అడిగినాడు.

పాపయ్య సమాధానం చెప్పకముందే కరణం ఉత్సాహంగా అన్నాడు: 'అనేదేముంది? పాపయ్యన్న ఎప్పుడైతే ఏది కాదన్నాడూ? ఊళ్ళో సంవాలిప్పుడే మొదలు పెడ్దాం.'

'ఈ చెక్క భజన్లు చేయడం కంటే కాస్త మంచిపని చెయ్యకూడదూ? ఇతకుముందు చేసిన భజన్లు చాలవా? వానా వానా, బావుల్లో నీళ్ళు అని ఏడుస్తుంటాం కదా? ఏం పెద్ద బ్రహ్మాండం. ఇతర దేశాల్లో ఇన్నూరు మున్నూరడుగుల లోతునుంచీ నీళ్ళు బయటికి తెస్తున్నారు. మనం ఏడెనిమిది మట్లకే ఏడుస్తాం. తాలూకాకు పది రిగ్గులు దించమను. అగ్గువగా బావులు తవ్వించమను. భూమిలో నీళ్ళు లేకేం. పోనీ మన చెరువును మర్యాదగా కట్టివుంటే కనీసం బావుల్లోనైనా నీళ్ళుండక పొయ్యేవా? అయిదు లక్షలు పోశారు కదా! చాకలోళ్ళు గుడ్డ లుతుక్కోడాని క్కూడా నీళ్ళు నిలబడవు. ఎట్లా నిలబడతాయి. పోసిన మట్టి కొట్టుకొని పోతోంటే దీన్ని గురించి పట్టించుకోరు. ఈ చెరువే వుంటే, ఆ గండికోట ప్రాజక్టు కట్టివుంటే పోనీ ఆ తుంగభద్ర దిగువకాలువ వచ్చివుంటే మనకిన్ని బాధలుండేవా? వాన దేవుడో అంటూ భజన్లు చేస్తారు కానీ అసలు సమస్యల్ని పట్టించుకోరు.' ఆవేశంగా పట్టాభి అన్నాడు. పట్టాభి విజ్ఞానియైన నిరుద్యోగి. ఉద్రేకి.

'అవునయ్యా నీ కేకలయితే బాగుండాయి ఈ సంగతి ఎవర్నడగాల?' ఇతరులను వాదనలోకి దింపడం కరణానికి ఎంతో ఇష్టం. వాదనలో తానెలాగా దొరకడు. కానీ ఇతర్ల పిలక తనకు దొరుకుంది. దొరికితే అవసరమైనప్పుడల్లా నాటకం ఆడించవచ్చు.

'ప్రభుత్వాన్ని' పట్టాభి తెంచినట్లు సమాధాన మిచ్చినాడు.

'ప్రభుత్వమంటే యెవరూ? మన రెడ్డి గంగిరెడ్డి, మన ప్రెసిడెంటు సిద్దయ్య నాయుడు, గంగిరెడ్డి బావమరది చెరువు కంట్రాక్టరు. సిద్దయ్యనాయుని బంధువు ఇంజనీరు! నీళ్ళనడగ్గలమూ చెప్పు. అడిగి బ్రదగ్గలమా చెప్పు.' కరణం లౌక్యాన్నంతా ప్రదర్శించాడు.

'అడగలేకేం. మన ప్రభుత్వంలో మరో కర్ని మారిపోయావే!' గంభీరంగా పట్టాభి అన్నాడు.

'ఎవర్ని?' కుతూహలంగా ప్రశ్నించాడు కరణం. చర్చ పాకానపడుతోంది. పట్టాభి అంతు తేల్చుతుంది. ఒక ఆట ఆడించవచ్చు అని మురిసిపోయినాడు కరణం.

'విన్నే. ప్రభుత్వాన్ని నాళ్ళ మ...

అయితే చక్రవర్తి తెలివితేటలు నీలాంటి వాళ్ళకి కదా!' పట్టాభి చురక తగిలేసరికి కరణానికి కోపం వచ్చింది.

'పెద్దంతరం చిన్నంతరం లేదు పిల్లొచ్చి గుడ్డు వెక్కిరిస్తోంది. పిదపకాలం, పిదప బుద్ధులు'— కరణం అస్త్రసన్యాసం చేసినాడు.

"ఈ రకమైన వాదనలు ఎక్కడికి దారితీస్తాయో పాపయ్యకు అనుభవమే. వీటి వల్ల ప్రయోజనంలేదు.

'నాకు ఒంట్లో బాగాలేదు' అని పాపయ్య వీధిలోనికి వచ్చినాడు. ఒకటి రెండు చినుకులు పడుతూనే ఉన్నాయి. పట్టాభి మాటల్లో నిజం వుంది. రిగ్గుల సంగతి గొప్పగా చెప్పుకుంటున్నారు ఈమధ్య. కానీ మంచినీళ్ళ బావులే తవ్వుతారట. నిజంగానే ప్రభుత్వం వాళ్ళ శ్రద్ధవుంటే ఇన్ని అవస్థలుంటాయా? పట్టాభి అన్నట్లు వానలు భజనలవల్ల వస్తాయా! పూర్వం వచ్చేవి. భజనలవల్ల వాన వచ్చినా రాకపోయినా రాజకీయాలొస్తాయి ఊళ్లో

# వాన కురుస్తే

తప్పక. దిగువవీధి భజనగుంపు ఎగువవీధి భజనగుంపుల మధ్య. చెరువు తెలిచివుంటే బావుల్లో నీళ్ళుండేవి— వంకకడ్డంగా కట్టబడ్డిన చెరువు కాబట్టి ఒకపెద్దవాన కురిసినా చెరువులో నీళ్ళు దండిగా ఉండేవి. చెరువు తెలిస్తేనా! అదెందుకు విలువున్నది? తుంగభద్ర కాలువొస్తే తన భూమి అయిదెకరాలు పారుతుంది. అది వచ్చేదెప్పుడు! అందరూ దొంగలే. ఈ మనుషులు బాగుపడరు. ఈ ఊరు బాగుపడదు. ఈదేశం బాగుపడదు. అందరూ చస్తారు. అప్పుల్లో చస్తారు. పనికిమాలిన రాజకీయాల్లో చస్తారు. పాపయ్య మనసులో కసి. గుండెల్లో మంట.

పాపయ్య ఇంటికి చేరుకొని భార్యను ఆత్రంగా అడిగినాడు:

'పైన గవాసులు అవీ వేయించావా. గుమ్మళ్ళెప్పైనా పడ్తాయేమో. మిద్దె మీద పడుతుంది కదూ.'

'ఆ ఈ వాన వచ్చిందా వచ్చింనా.' పాపయ్య భార్య వేదాంతం పలికింది.

ఏమైనా వానవస్తే ఆ ఇంట్లో వుండడం కష్టంది. ఆ సారి వానలు బాగా కురుస్తే, పంటలు బాగా పండితే మిద్దె కూడబీకి తిరిగి కప్పించాలి. దంతెలు పుచ్చిపోయినాయి. నాయన కొత్తమిద్దె కట్టాలనుకున్నాడు. కాని కట్టకుండనే వెళ్ళిపోయినాడు. తాను కొత్తది కట్టకపోయినా పాతదైనా పదిలం చెయ్యాలి. వాళ్ళ ఈ మొండివస్తే పెద్దవానే పడుతుంది. గుమ్మళ్ళు పడతామేమో, పడితే రాత్రంతా జాగరం తప్పదు.

'ముందు తొందరగా భోంచెయ్యి. గబ్బనా వెకూడా అయిపోవచ్చింది. ఇంకొంపో.' భార్య సణుక్కుంటూ చెంబుతో నీళ్ళిచ్చింది. చెంబందుకొని నసిక్కుంటున్న కిరసనాయిలు దీపంవైపు చూస్తూ 'పెద్దోడెక్కడికి పోయినాడూ?' పాపయ్య ప్రశ్నించినాడు.

'నీవెంతకూ రాకపోయేతలికి నీకోసం తోటదగ్గర కొచ్చినాడే. ఎదురుపల్లేదా. ఇంత పొద్దుపోయిందాకా ఆ తోటదగ్గర ఉండకపోతే కారిపోయిందా?' పాపయ్య భార్యకు జీవితం విసుగొచ్చింది తప్ప — ఇంకేమీ ఇవ్వలేదు.

పెద్దకొడుక్కు తనమీద తెగని ప్రేమ. కొడుకులంతా అట్లాంటివాళ్ళే. ఇప్పుడీ సో తనకోసం తోటదగ్గర కెళ్ళినాడు.

'వాడు వాన్లో చిక్కుకుంటాడేమో' పాపయ్య అన్నాడు. 'నీకీమధ్యన వానపిచ్చి పట్టింది.' పాపయ్య భార్య నడుస్తూ అంది.

పాపయ్య భోజనం ముగించి ఇంట్లోంచి బయటికి వచ్చి ఆకాశంవైపు చూచినాడు. చుక్కల్లేవు. మోడమట్లానే ఉంది. ఒకటి రెండు చినుకులు రాల్తూనే ఉన్నాయి. పెద్దవాన రానందుకు పాపయ్య విసుక్కున్నాడు. వాన మళ్ళీ ఏమైనా ఎగదంతుందా! వస్తున్నా వస్తున్నా అని తెగ ఊరిస్తుంది. ఎగదంతుంది. లేదు ఈరోజు తప్పకుండా పెద్దవాన వస్తుంది. పంచాంగంలో ఉంది. రేడియోలో చెప్పినారు. తన మనసు చెప్తూంది.

నిద్రవస్తూంది. ఇంట్లోకి వెళ్ళి మంచం మీద పడుకున్నాడు. ఉబ్బరంగా ఉంది. తెగ ఉబ్బరంగా ఉంది. గాల్లేదు. వానొస్తే తర్వాత చూసుకోవచ్చు. పాపయ్య మంచం బయట వేసుకొని పడుకున్నాడు. పగలంతా తోటకాడపని ఆలోచనలు. ఆశలు నిరాశలు. అలసిపోయిన పాపయ్యకు వెంటనే నిద్రకమ్మింది. నిద్రలో పాపయ్యకు ఒక కల వచ్చింది: పెద్దవాన పడుతోంది. చెరువు నిండింది. బావిలో నీళ్ళు. పొదుల్లో నీళ్ళు ఇంట్లో నీళ్ళు, వీధిలో నీళ్ళు, తనమీదనీళ్ళు. ఎక్కడచూచినా నీళ్ళు. తాను రాసిచ్చిన బాండు కాగితాలన్నీ నీళ్ళల్లో కొట్టుకొనిపోతున్నాయి. ఎర్రటి మిరపపండ్లు. బాగా ఊరిన సెనక్కాయలు, చీనీపండ్లు లారీలు, రూపాయలు—అన్నీ రూపాయలే. రూపాయల్ని తను వెదజల్లుతున్నాడు. అంగడి రామిరెడ్డి ఆబగా ఏరుకుంటున్నాడు. కాని వాడు నీళ్ళల్లో కొట్టుకొనిపోయి చెరువులో మునిగిపోతున్నాడు. మునిగిపోతున్నాడు, పోతున్నాడు. ఉన్నట్టుండి ఉరిమిన ఉరుముకు కల చెదిరింది. మంచంలోంచి దిగ్గున భయంతో లేచిన పాపయ్యకు గుండె వేగంగా వేగంగా కొట్టుకొంది. ఆర్తనాదంచేసి పాపయ్య మంచంలోనే కూలిపోయినాడు. ఆకాశంలోంచి ఆ రాత్రి వానపడ్లేదు. ఇంట్లో వాళ్ళ కళ్ళల్లోంచి పడింది. ఇంట్లోవాళ్ళ గుండెలు చెరువులైనాయి. ఉదయం ఊళ్ళోవాళ్ళంతా పరామర్శించడానికి వచ్చినారు. పాపయ్య పెద్దకొడుకు మల్లయ్యను పక్కకు పిలిచి సుంద్రరెడ్డి అన్నాడు:

'ఇప్పుడు విచారించి లాభమేముంది? జరిగేవి చూడాలి. పాపయ్యమామ బతికివున్నాళ్ళూ బయటపడకుండా బతికినాడు. కొంత అప్పులబాధేదో ఉన్నట్లుంది. నాతో అనేవాడు. ఎప్పుడవా. మీ నాయన లోతు మనిషి. నీకేమైనా చెప్పినాడా?' పాపయ్య తనక్కూడా బాకీ ఉండే సంగతి సుంద్రరెడ్డి చెప్పకుండ జరిగేవని చూడమని మల్లయ్యకు చెప్పినాడు. మల్లయ్య దుఃఖాన్ని దిగమింగుకొంటూ అన్నాడు: 'నేనెప్పుడూ ఆయన ఏంచేసినా ఒక్కమాట అడగలేదు. అప్పులున్నాయని తెలుసు. ఎంతుండాయో తెలీదు. ఎన్ని బాకీలున్నా తప్పకుండ తీరుస్తాను మామా తీరుస్తాను. మా వంశం సంగతి నీకు తెలీదా? గొంతులో ప్రాణం ఉన్నంత వరకు ఒకరికి బాకీలు ఎగరేయం.'

అంగడి రామిరెడ్డి భుజం మీద చేయివేసి మల్లయ్యతో నెమ్మదిగా అన్నాడు:

'చూడు మల్లయ్యా! ఈమధ్యన మీ నాయన నాదగ్గర చేసిన బాకీని గూర్చి దిగులు పెట్టుకోవద్దు. తొందరేం లేదులే. నిదానంగా చూసుకోవచ్చు. దినవం అయ్యాక అంతగా అయితే రాతకోతలూ అవీ వుంటే చూసుకోవచ్చు.' రామిరెడ్డి కూడా మంచోడే. ఇట్లాంటి వాళ్ళు ఉండబట్టే తన ఇంటి గౌరవం నిలిచింది. మల్లయ్య కళ్ళు కృతజ్ఞతతో మెరిసినాయి. రామిరెడ్డి ఆత్రగాడు కాదు. గాలానికి బాగా చిక్కిన తర్వాత చేపను బయట వేస్తాడు. ఆ చేప బాగా దొరుకుతుంది. రామిరెడ్డి మనసులో అంకెలు దొర్లుతున్నాయి.

దినసాలు ముగిసినాయి. మల్లయ్యకు ఇంటి విషయాలన్నీ నెమ్మదిగా పడుతున్నాయి. తండ్రి మరణానికి ముందు మల్లయ్య పొలంపనులను గూర్చి మాత్రమే ఆలోచించేవాడు — తండ్రిదే పెత్తనం కాబట్టి. ఇప్పుడు పొలంపనులు, ఇంటి బాధ్యతలు, బాకీలు.

నెలరోజుల తర్వాత మల్లయ్య ఒకరోజు తోటదగ్గరకు వెళ్ళినపుడు బావిగట్టున నిలబడి అనుకున్నాడు: ఆయన పోయాక ఒకవాన వచ్చింది. ఇంకొక మంచివాన కురుస్తే — మిరపచెట్లకు కాయ బాగా పడుతుంది. ధరలున్నాయి. పెసక్కాయ [illegible]

# సినిమా

## ఈస్ట్‌మన్ కలర్‌లో దత్తపుత్రుడు

'కష్టేఫలి' అనేది నానుడి వృథా పోలేదు. తమ్మారెడ్డి కృష్ణమూర్తికి. అందుకే ఆయన తీసిన ప్రతిచిత్రం ప్రజాదరణ పొందింది. ప్రేక్షకుల మనోభావానికి ఎలాంటి కథ అవసరమో, అలాంటిది దొరికేవరకు నిర్మాణానికి ఉపక్రమించరు ఆయన. 'జమిందారు దగ్గర్నుండి సిసింద్రీ చిట్టిబాబు' వరకు రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన ప్రతిచిత్రం కాసో కూసో డబ్బు చేసుకుంది; విపరీతంగా జనాన్ని ఆకర్షించింది.

ఇప్పుడు 'దత్తపుత్రుడు' ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబడుతూంది. దర్శకత్వాన్ని ఆయన కుమారుడు టి. ఎల్. బాబు చేపట్టారు. తమ తండ్రితో నిర్మాణ బాధ్యత నిర్వహిస్తూ, సాంకేతిక శాఖల్లో సముచితమయిన పరిజ్ఞానాన్ని సంపాదించి యుండడంవల్ల, దర్శకుడిగా రాణించగలడనే నమ్మకం వుంది. ఈ చిత్రానికి పినిశెట్టి మాటలను, చలపతిరావు సంగీతాన్ని, వెంకటరత్నం ఛాయను, సంజీవి కూర్పును నిర్వహిస్తారు. నాయకీనాయకులుగా వాణిశ్రీ, నాగేశ్వరరావు నటించే ఈ కలర్ చిత్రంలో కృష్ణ, నాగభూషణం, పద్మనాభం, సత్యనారాయణ, వెన్నిరాడై నిర్మల, శాంతకుమారి ఇతర ముఖ్యపాత్రలను ధరిస్తారు.

—శ్రీనివాస్ ●

## సినిమా డైరీ

● రవీంద్రా ఆర్ట్‌పిక్చర్స్ చిత్రంలో నాగేశ్వరరావు, కృష్ణ కలిసి నటిస్తున్నారు. టి. ఎల్. బాబు దర్శకుడు.

● జగపతి ఆర్ట్‌పిక్చర్స్ నిర్మిస్తున్న తదుపరి చిత్రానికి 'బంగారుబాబు' అని పేరు పెట్టారు. వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకుడు.

● అన్నపూర్ణా ఆర్ట్‌పిక్చర్స్ 'ప్రొడక్షన్ నెం. 2' ను ఆదుర్తి డైరెక్ట్ చేస్తారు.

● 'ప్రేమనగర్' చిత్రం తమిళంలో నిర్మించబడుతూంది. శివాజీ నాయకుడు.

● జెమినీ ఆర్ట్‌పిక్చర్స్ నిర్మిస్తున్న 'ఇరుకోడగల్' తెలుగు చిత్రంలో వి. రామారావు అనే కొత్త గాయకుడు పరిచయం అవుతున్నాడు.

● వాసూమీనన్ కలర్‌లో నిర్మిస్తున్న సాంఘికంలో జమున, రామారావు నాయికానాయకులు. ఏ. భీంసింగ్ దర్శకుడు.

ఏవారైనాసరే, ఎక్కడున్నాసరే, మీరు ఈ చిత్రంలో పాత్రలే

ఈ ఉదాత్తకుటుంబగాథ మీది

నాగిరెడ్డి - చక్రపాణి సమర్పించు విజయా ఇంటర్‌నేషనల్ వారి

# ఘర్ ఘర్ కి కహాని

(ఇంటింటికథ) ఈస్ట్‌మన్‌కలర్



దర్శకత్వం: టి.ప్రకాశరావు  సంగీతం: కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ

Vijaya

ted and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty
tasel, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3,



లండన్‌లోని ఊల్స్ వర్త్స్‌కి మోడల్‌గా పని చేయడానికి
అంగీకరించిన మిస్ ఇంగర్డ్ మూగిన్ నాగ్

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

